# నీరజ



హిందీనుండి అనువాదం:

శ్రీ కె. రమేశ్

శిలాపబ్లిషరు్స




విజయవాడ-2.

శిలా ప్రచురణలు :

సంపాదకుడు.

యం. గురవారెడ్డి

ప్రథమ ముద్రణ

1961

వెల : 1-75

శిలా ప్రెస్.

విజయవాడ-2

# నీరజ

చాలా రోజులనుంచి నీరజకు జబ్బుగా ఉంది. తో ఆమె పూర్తిగా చిక్కి శల్యమైపోయింది. మిలమిల మెరిసిపోతూఉండే ఆమె శరీరకాంతి తగ్గిపోయి తెల్లగా పాలిపోయింది. ఏ ముహూర్తాన వచ్చిందో ఆ జబ్బు నీరజలోని కళాకాంతుల్ని హరించివేసింది. రోజురోజుకూ క్షీణించి అస్థిపంజరంగా తయారయింది. అందువల్ల చేతులకు ఉన్న గాజులు, శరీరంమీద ఇతర ఆభరణాలు వదులైపోయాయి. రక్తనాళాలు పైకి తేలి కనపడుతున్నాయి. కళ్ళచుట్టూ నల్లరంగు ఏర్పడింది. వీటన్నిటివల్ల ఆమె ఎంత బలహీనపడిపోయిందో స్పష్టమవుతుంది.

మెత్తని దిళ్ళను ఆనుకొని అర్థశయనస్థితిలో ఆమె రోగశయ్యమీద పడుకొని ఉంది. కాళ్ళమీద తెల్లని దుప్పటి కప్పుకొంది. అలా పడుకొని కిటికీలోనుంచి బయటి పూలతోటను చూస్తూఉంది.

ఆమె పడుకొనిఉన్న గది చాలా శుభ్రంగానూ, అందంగానూ ఉంది. మంచానికి దగ్గరగా మందుసీసాలు వగైరా ఉంచటానికిగాను చిన్న బల్ల ఒకటి ఉంది; ఇతరులెవరైనా వస్తే కూర్చోటానికని రెండుమూడు పేముకుర్చీలు కూడా ఉన్నాయి. బట్టలు వేసుకునేందుకు ఒక ప్రక్కన గోడకు [illegible] త్రాడు

4 నీరజ

ఆమె మంచానికి ఎదురుగా గోడమీద
పరమహంస చిత్రం వ్రేలాడుతూ ఉంది. ఆ చిత్ర
భాగాన క్రింద రజనీగంధ పుష్పగుచ్ఛం ఉన్న పూ
ఉంది. గదినిండా ఆ పుష్పసౌరభము గుబాళిస్తూ ఉంది.

ఆకిటికీలోనుంచి చూచినట్లయితే పూలతోట చక్కగా
కనపడుతూ ఉంటుంది. నీరజ ఆరోగ్యంగా ఉంటున్న రోజుల్లో
తమ పూతోటలో ఒక పొదరింటిని వేసింది. ఆ పొదరింటి
విష్ణుక్రాంత లతను ప్రాకించింది. ఆలతనవనవలాడుతూ
...తో చక్కగా తీగెలుసాగి ఆపొదరింటిని పెనవేసుకొ
అదిచూచి నీరజమనస్సు సంతోషముతో ఉప్పొంగిపోయిం
విష్ణుక్రాంతలత పూలుపూసే తరుణం వచ్చేసరికి మరి
అందముగా కన్పించసాగింది. ఆ పూదోటమధ్య ఒక చి...
కొలనుఉంది. ఆకొలను మధ్య ఉన్న గొట్టము చిమ్మే నీర
చుట్టూఉన్న పూలమొక్కల మీదపడుతూ ఉంటుంది. నీర
కిటికీలోనుంచి చూచు ఆసమయాన ఆగొట్టమునుండి వెలువ
నీటిజల్లు గలగలలతో పూలమొక్కల్ని తడుపుతూ ఉ
ఆదృశ్యము కడుమనోహరముగా ఉంది. పూలమొగ్గలుబం
రంగుతో మెరుస్తున్నాయి. మామిడి చిగుళ్ళఅందం చెప్ప
పరమే లేదు. మామిడిపూత వికసిమ్మే సువాసనలకు
క...న కోయిలమైమరచి గొంతెత్తి మధురంగా పాడుతూ

...లేచి సంతోషంగా తనపూదోటలో
... ...కని అక్క...

ఇది ఆమెకు నిత్యవ్యసనంగా తయారయింది. ఆమెకు ఆనందం కలిగించేది కూడా ఇదే.

అప్పుడు కాపలామనిషి వసారాలో నిలబడి ఉన్నాడు. తోటలో పనిచేయు కూలీలకు విశ్రాంతిసమయాన్ని గుర్తు చేస్తూ అతడు గంటకొట్టాడు. అప్పుడు పన్నెండు గంట లయింది. మూడుగంటలవరకు అందరికీ విశ్రాంతి. గంట మ్రోగేసరికి నీరజ మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది. విశ్రాంతిని గురించి ఆలోచించేసరికి ఆమెకు విచారం కలిగింది పనివాళ్ళందరూ ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయేసరికి పూదోట నిర్మానుష్యమై నిశ్శబ్దంగా ఉంటుంది. అది తలుచుకొని నీరజ దీర్ఘంగా నిట్టూర్చింది. నీరజకుకూడా ఇది విశ్రాంతిసమయం. కిటికీ తలుపులు మూయటానికని దాసీ ఆ గదిలోకి వచ్చింది. నీరజ ఆమెను వారించి తోటలోనివృక్షముల క్రింద దోబూచు లాడుతున్న వెలుగునీడలను చూస్తూ కూర్చుంది.

నీరజ భర్తపేరు ఆదిత్యుడు. పూలవ్యాపారిగా ఆదిత్యుడు ప్రఖ్యాతిపొందాడు. తమ వివాహమైన వెంటనేనీరజ ఆదిత్యులు పూదోటను పెంచారు ఈ పూదోటను వారిద్దరూ ఎంతో శ్రమించి, కన్నబిడ్డను సాకినట్లు అమిత ప్రేమతో పెంచారు. వారి దాంపత్యక్రీడలకు ఈ పూదోట కేంద్రంగా ఉండేది. ఆ దంపతుల శ్రమఫలితంగా పూదోట నిలువెల్లా పూలపచ్చడానిక్ని కప్పుకొంది. వారి కష్టఫలితంగా తోటలోకి రంగురంగుల పువ్వులు కిలకిల నవ్వసాగాయి. ఆ తోటలోని పూలు వికసించి సువాసనలు విరజిమ్మినప్పుడు ఆ దంపతులకు నూతనచైతన్యం లభించేది. ఆ యా ఋతువులకు చెందిన

రకరకాల పూలు వికసించేవి. వారెంతో మురిసిపోయేవారు. తమను నచ్చిన పుష్పాలనుగురించి విసుగూ విరామంలేకుండా పొగుడుతూ ఉండేవారు. ఒక్కమాటతో చెప్పాలంటే ఆ పూదోట ఆదంపతులను సర్వదా నూత్నజీవితాన్ని ప్రసాదిస్తూ ఉండేది.

వెనుకటి మధురస్మృతులు అనేకం నీరజహృదయంలో గాఢంగా హత్తుకొని ఉన్నాయి. అనుక్షణం ఆ జ్ఞాపకాలు ఆమె మనస్సులో మెదులుతూఉండేవి. ఆ తోటలో పడమటి వైపున ఒక వేపచెట్టు ఏపుగా పెరగటం, మరొకటి విరిగిపడి ఎండిపోయిన సంగతులు ఇప్పటికీ ఆమె కళ్ళల్లో మెదులుతూనే ఉన్నాయి.

ప్రతిరోజూ భార్యాభర్తలు ఇద్దరూ ఆ చెట్టుక్రింద అరుగుమీద కూర్చొని అల్పాహారంచేసి టీ త్రాగేవారు. గుమ్మటంవలె పెరుగుతున్న ఆ నిమ్మచెట్టు ఆకుల్లోనుంచి ఉదయకాలపు సూర్యకిరణాలు దోబూచులాడేవేళ ఆ దంపతులు తోటలో పని ప్రారంభించేవారు. ఎండ తగలకుండా నీరజ గొడుగులాంటి రంగురంగుల టోపీధరించేది. ఆదిత్యుడు కూడ టోపీ ధరించేవాడు.

నడుములకు పెద్దపెద్ద గంపలుకట్టుకొని, పూలమొక్కలకు ఉండే ముళ్ళనుంచి తప్పించుకోటానికి వాళ్ళిద్దరూ కత్తెర్లతో పూలను కోసేవారు. ఇది వాళ్ళిద్దరూ నిత్యం చేసే పని. వాళ్ళిద్దరూ అలా పనిచేస్తున్న సమయాల్లో అతిథులు ఎవరైనా వస్తే వారినికూడా తమవెంట తోటలో త్రిప్పుతూ వారితో సంభాషిస్తూనే తమపనిని చేసుకునేవారు.

ఆపూదోటలో అందచందాలను చూసివచ్చిన వారికి అమితాశ్చర్యం కలిగేది. పూలమొక్కలు, లతలు అన్నీ పుష్పాలతో నిండి ఎంతో అందముగా కన్పించేవి పుష్పము లను గురించి ఎంత తెలిసిన వారైనప్పటికీ వచ్చిన అతిథులు ఒకొక్కప్పుడు చామంతిపూలను చూసి ప్రొద్దుతిరుగుడు పువ్వులని భ్రమపడుతూ ఉండేవారు. 'అయ్యో, ఇది ప్రొద్దు తిరుగుడు పువ్వుకాదు, చేమంతి' అని నీరజ వారితప్పును సవ రిస్తూ ఉండేది. అతిథులు తమపొరపాటును దిద్దుకొని, పూదోట విషయంలో ఆదంపతులు చేస్తున్న కృషినీ, ఆతోటలోని పుష్పాల ప్రత్యేకతనూ ప్రశంశించేవారు పుష్పాలకోసం అతి థులు ఆశగా చేతులుచాచేవారు; నీరజ వారికి నచ్చినపూలు కోసిఇచ్చేది. అతిథులకు పుష్పదానంచేసి నీరజ మహాదానం దాన్ని పొందేది. అంతటితోనే అతిథి సత్కారం ముగిసేది కాదు. వారిలోఎవరైనా ఏదైనా పూలఅంటు అడిగితేచాలు ఆమె సంతోషంగా ఇచ్చేది.

నీరజ అల్పసంతోషి. ఎవరైనా ఆమెను ఏ కొంచెం ప్రశంశించినా ఆమె పొంగిపోయేది. బహుశా, అందుకనే కావచ్చు, ఎప్పుడుచూచినా ఆమెఇల్లు బంధుమిత్రులతోనిండి ఉండేది. వాళ్ళందరిని తానే వెంటబెట్టుకొని తోటలో త్రిప్పేది, ఫలపుష్పాదులను బహూకరించి సాగనంపుతూ ఉండేది. ముఖ్యంగా ఆతోటలోని ఆపిల్‌పళ్ళు కొబ్బరికాయ లంటెఅందరికీ ఎంతో ఇష్టం.పరులెవరైనా తమపూదోటను, దానిలోని ఫలపుష్పాదులనూ గొప్పగా ప్రశంశించి నప్పుడు, నీరజ తమకష్టం ఫలించిందని ఆనందించేది.

ఇవన్నీ గతవిషయాలు; ఈమధురస్మృతులు ఉండిఉండి నీరజ హృదయాన్ని బాధించసాగాయి. తానూ, తనభర్త కలిసి ఎలా కృషి చేసిందీ, తమపూదోట రోజురోజుకూ ఎలాఅభివృద్ధి చెందిందీ ఆలోచించి బాధపడుతూ ఉండేది. ఎండిపడిపోయిన వేపచెట్టును కోయించినీరజ టీబల్లలూ, ఎత్తుపీటలూ చేయించి భార్యాభర్తలు ఇద్దరూ ఉదయకాలపు సుగంధ వాయువు సేవిస్తూ సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ తేనీరు త్రాగే సమయాల్లో ఆబల్లలనే ఉపయోగించేవారు. ఆవిషయాన్నీ, ఆరోజులను తలచుకో సాగింది.

ఏఋతువుకు తగ్గపూలు ఆ ఋతువుల్లో తమ సౌంద ర్యాన్ని ప్రకటించి, సువాసనలు వెదజల్లుతూ ఆ దంపతుల మనస్సులను మైమరపించి వేసేవి. అందాల ఆనందం వారి సంసారం. అలాంటి సుఖసంసారం అకస్మాత్తుగా మాయమై పోయింది. అదిప్పుడు శిథిలమైనట్లుఉంది. నీరజ వెనుకటి సుందర సుఖమయజీవితాన్నిగురించి ఆలోచిస్తూ 'మధురమైన నాజీవితాన్ని హరించింది ఎవరు? నాజీవితం ఇలాఎందుకు శిథిలమైపోయింది! దీనికి కారణం ఎవరు? ఇందుకుఎవర్ని నిందించాలి? ఇది మేముచేజేతులా చేసుకున్నదా లేక బ్రహ్మ దేవుని లిఖితమా! విధివిధానమే దీనికికారణమా? నాజీవితం లోని పండంటి ప్రపంచాన్ని నాకుకాకుండా చేసిన దైవశక్తి ఏది?' అని పలువిధములుగా తలపోయసాగింది.

వివాహం అయిన నాటినుంచీ నీరజజీవితం ఏవిధమైన ఒడుదుడుకులు లేకుండా హాయిగా గడిచిపోతూ వచ్చింది. ఆనాడు నొప్పిలేని పూలపాన్పు ఆమె జీవితం. అన్యోన్యంగా

మధురంగా సాగిపోయే ఆమె జీవితాన్నిచూచి స్నేహితు రాండ్రు ఈర్ష్యపడుతూ ఉండేవారు. దుర్లభమైన మధుర దాంపత్యజీవితం ఆమెకు లభించటమే వారి ఈర్ష్యకు కారణం.

ఆదిత్యుని ఆనందమయ జీవితాన్ని చూచి అతని మిత్రులు 'ఎంత అదృష్టవంతుడివోయ్' అని ప్రశంసించేవారు. దాంపత్యజీవితాలనుగురించి చర్చవచ్చినప్పుడు నీరజ, ఆదిత్యుల ఆదర్శ దాంపత్యాన్ని తప్పక పేర్కొనేవారు. వారి ఆదర్శ దాంపత్య చర్చలేకుండా వారి సంభాషణ ముగిసేదే కాదు. ఇటు ఆదిత్యుని మిత్రులు, అటు నీరజ స్నేహితురాండ్రుకూడా వారిని గౌరవభావంతో చూసేవారు. ముఖ్యవిషయమేమంటే సుఖమయమైన ప్రేమభరితజీవితమే వారి జీవిత సత్యం అదే వారి జీవితరహస్యం.

ఆదిత్యుడు డాలీ' అనే ఒక కుక్కను పెంచుతూ ఉండేవాడు. అతడంటే దానికి చాలాఇష్టం; ఎప్పుడూఅతనిని అంటిపెట్టుకొని తిరుగుతూ ఉండేది. ఆదిత్యునికి వివాహమైన తరువాత అది అతనినివదలి నీరజవెంట తిరుగుతూ ఉండేది. ఆదిత్యుడు రోజూ మార్కెట్టుకు వెళుతూ ఉండేవాడు. నీరజ ఎప్పుడూ ఇంట్లోనే ఉండేది కనుక డాలీ యజమానురాలి యందే ఎక్కువ ప్రేమగా ఉండేది. అందుకు తగినట్లు నీరజ కూడా దానిని కన్నబిడ్డవలె చూసేది.

నీరజజీవితంలో ఆ కుక్క రగిల్చిన దావానలం ఇంత వరకు చల్లారలేదు. ఆ కార్చిచ్చు ఆమె మనసులో ఇప్పటికీ రగులుతూనే ఉంది. విశ్వాసంగల ఆ కుక్క ఇంటిని కాపలా కాస్తూ, కాకిని గద్దనుకూడా ఆ వనిచ్చేది కాదు. వారింటికి

ఎవరువచ్చినా, కార్లు, టాంగాలు ఏవివచ్చినా అంతదూరాన చూసి మొరగ నారంభించేది. నీరజ ఇంటిలోనుంచి బయ టకు వచ్చి సైగచేసేవరకు అలాగే మొరుగుతూనే ఉండేది. నీరజ, ఆదిత్యుడు ఇద్దరూ ఎప్పుడైనా ఎక్కడికైనా వెళితే డాలీ ఇంటిని కాపలాకాస్తూ గేటులోనే కూర్చుని ఉండేది. లేకపోతే ద్వారంముందు అటూఇటూ తిరుగుతూ ఉండేది.

సృష్టికర్తపనులు అతి విచిత్రంగా ఉంటాయి.ఒకనాడు అకస్మాత్తుగా డాలీకి జబ్బుచేసింది అంత అకస్మాత్తుగానే జీవితయాత్ర చాలించి శాశ్వతంగా మృత్యుదేవత వ్డిలో నిద్రపోయింది. డాలీ నీరజ ఒడిలోనే కన్నుమూసింది. ఆ దృశ్యం ఆమె హృదయాన్ని కదిలించివేసింది; అది ఆమె మనసులో మరువలేని శాశ్వత బాధగా మిగిలిపోయింది. ఆ బాధను మర్చిపోవాలని నీరజ అనేకసార్లు ప్రయత్నించింది. ఆదిత్యుడుకూడా మరపించాలని ప్రయత్నించిచూశాడు; కానీ ఏమీలాభం లేకపోయింది. నీరజ డాలీ మరణాన్ని మర్చి పోలేకపోయింది.

చిన్నతనంనుంచీ నీరజ మొండిపట్టుగలది. తన జీవిత విషయాల్లో ఇతరులు జోక్యంచేసుకుంటే ఎంతమాత్రం సహిం చేది. కాదు ఇతరవిషయాలతో ఏమీ సంబంధం లేనట్లే ఉండేది. కానీ డాలీ చనిపోయిననాటినుంచీ 'సృష్టికర్త పనులు ఎవరికీ తెలియవుగదా! విధివిధానాన్ని ఎవరూ ఆపలేరు' అని ఆలోచించసాగింది అంతేకాదు; 'ఈప్రపంచం నశ్వరమైనది; క్షణికమైన ప్రాపంచికసుఖాలకోసం ప్రాకులాడటం వృథాయే గదా!' అనే భావం ఆమె హృదయంలో గాఢంగా హత్తు

కొని పోయింది. మొట్టమొదటగా మృత్యుభయం ఆమెహృదయంలో ఆనాడు ఏర్పడింది. అది ఇక ఆమె హృదయంలో నుంచి చెరిగి పోలేదు.

వివాహమై ఎన్ని సంవత్సరాలు గడిచినా నీరజకు సంతానం కలుగలేదు. తనకీజన్మములో సంతానప్రాప్తి ఉండదేమో అని ఆమెవిచారించేది సంతానంకలుగుతుందనే ఆశ నిరాశ అయినకొద్దీ ఆమెలోని పుత్రవాత్సల్యం గణేశుని మీదికి మళ్ళింది.

గణేశుడు వారిని ఆశ్రయించుకొని బ్రతుకుతున్నవ్యక్తి. ప్రేమ వాత్సల్యాలు స్త్రీ సహజలక్షణాలు; నీరజకూ తాతనలో ఉన్న సహజప్రకృతిని నిరోధించుకోలేకపోయింది. గణేశుణ్ణి కన్నబిడ్డవలె చూచుకోసాగింది. ఈవిధంగా ఆమె డాలీ మృత్యువునుగురించి మర్చిపోతూఉంది, అప్పుడే గర్భవతి అయింది. ఆమె సంతోషానికి అంతులేదు. ఆమె మనస్సు ఆనంద తరంగితమై పుట్టబోయే బిడ్డనుగురించి ఏవేవో ఆలోచనలు చేయసాగింది. మాతృత్వభావ తరంగాలతో ఆమె హృదయం నాట్యచేయసాగింది. ప్రసవించకముందే తన బిడ్డకు దుస్తులు కుట్టించేది.బొమ్మలు కొనేది.టోపీలు వగైరా అల్లేది; ఎప్పుడు ప్రసవిస్తానా, బిడ్డను ఎప్పుడు ఎత్తుకొని ముద్దాడుతానా అని అదుర్దాతో ఎదురు చూడసాగింది.

చివరకు ఎదురు చూస్తూఉన్న శుభసమయం రానే వచ్చింది. నీరజకు నొప్పులు ప్రారంభమయ్యాయి. ఆదిత్యుడు మంత్రసానిని, డాక్టర్లను, నర్సులను పిలిపించాడు. ప్రథమ అనుభవం కావటంవల్ల అతడు గాబరాపడుతూ రకరకాలుగా

వారిని ప్రశ్నించసాగాడు. చివరికి అతని ప్రశ్నలతో విసిగి పోయి కసురుకొని అతనిని కొంచెం దూరంగా ఉంచారు. శిశువు గర్భంలోనే చనిపోయింది. డాక్టర్లుపిండాన్ని బయటకు తీసి అతి ప్రయాసమీద నీరజప్రాణాలను కాపాడ గలిగారు. దానివల్ల నీరజహృదయం గాయపడింది. ఆమె మనస్సు వికా వికలైపోయింది. తనబిడ్డ మరణాన్ని ఆమె మర్చిపోలేకుండా ఉంది. ఆమె జీవితానికి తగిలిన రెండోగాయం ఇది. విచా రంతో నీరజ మంచం పట్టింది. నాటినుంచి నేటివరకు రోగ శయ్యా మీద నేఉంది. రోజురోజుకూ క్షీణించి పోతుంది. ఆమె మనస్సులోని ఉత్సాహము, ఆనందము పూర్తిగా నశించి పోయాయి.

నాటినుంచి నేటివరకు నీరజ రోగంతో బాధపడు తూనే ఉంది. ఇదేగదిలో రోగశయ్యమీద పరుండి కిటికీలో నుంచి పూదోటను చూస్తూ, పుష్పసౌరభాన్ని మోసుకొచ్చే పిల్లవాయువుల్ని అనుభవిస్తూ కాలంగడుపుతూ ఉంది. అలా పూదోటను చూస్తూ గడపటం ఆమె మనస్సుకు సంతృప్తి నిచ్చేది. మనస్సును దేనియందైనా లగ్నముచేసి తనను తాను మర్చిపోవాలని ప్రయత్నించేది.

జబ్బుతోపాటు మానసిక బలహీనతకూడా వచ్చింది ఆమెలో. చిన్నచిన్న విషయాలుకూడా ఆమె మనసుకు ఎంతో బాధ కలిగిస్తున్నాయి. వాటినిగురించి అధికంగా ఆలోచించి మరింత వ్యాకులపడేది. గతంలోని తమ సుఖమయ దాంపత్యజీవితాన్నిగురించి ఆలోచించి చాలా బాధపడుతూ

ఉండేది. భర్తను చూచినప్పుడు అతనిమీద తనకున్న అధికారాన్ని గుర్తుచేస్తున్నట్లు వ్యవహరించేది.

ప్రస్తుతం ఆమెను అధికంగా బాధిస్తున్నది ఒకేఒక విషయం. బంధుత్వరీత్యా సరళ నీరజకు చెల్లెలువరుస అవుతుంది. తోటపనుల్లో తనకు సహాయంగా ఉంటుందనే ఉద్దేశ్యంతో ఆదిత్యుడు ఆమెను ఇక్కడికి తీసుకువచ్చాడు. సరళ అతడు ఆశించినట్లు చాలా సహాయపడుతూ ఉండేది. తోట పనుల్నిగురించి రానురాను ఆదిత్యుడు నీరజను సలహాలు అడగటం మానేశాడు. ఇప్పుడు సరళ వెనుకటినీరజస్థానంలో నిలిచి పనివాళ్ళమీద పెత్తనంచేస్తూ పనులు చేయించటం చూచినప్పుడు నీరజకు వళ్ళు కంపరం పట్టేది. తన అసమర్థతకు దిగులుచెంది నీరజ మరింత వ్యాకులపడసాగింది.

'పండంటి నా జీవితంలోకి ఈ సరళ ఒక పీడకలగా దాపురించిందే!' అని నీరజ విచారించేది. 'నా భర్తను మోసగించి లోబరచుకుంటుందేమో!' అనే సందేహం ఆమెను మరింత క్రుంగదీసింది. అనుక్షణం ఇలాంటి సందేహాలతో, ఆలోచనలతో నీరజ బాధపడుతూ ఉండేది.

అప్పుడప్పుడూ వెనుకటి మధురస్మృతులు అనేకం ఆమె మనోవీధిలో మెదులుతూ ఉండేవి;

ఒకప్పుడు నీరజ ప్రేమతో సరళను తన ఇంటికి ఆహ్వానించి ఆదరించేది. క్రొత్తక్రొత్త పూలమొక్కల్ని వేయటాన్ని గురించి ఆ రోజుల్లో నీరజ సరళతో చర్చించేది. ఇద్దరూకలిసి తోటలోని కొలనులో స్నానంచేసేవారు. ఇద్దరూ తోటలో తిరుగుతూ రకరకాల పళ్లు కోసుకొని తినేవారు; గొంతుకలిపి

సర్దాగా పాటలుపాడేవారు. తీరికవేళల్లో పనివాళ్ళకు మిఠాయిలు వగైరా తినుబండారాలు పంచేవాళ్ళు. సరళ వచ్చినప్పుడు ఇలా రోజంతా పనిపాటలతో, వినోద కాలక్షేపాలతో హాయిగా గడిచిపోతూ ఉండేది.

అప్పుడు నీరజ సరళను చాలా ప్రేమాభిమానాలతో చూసేది. ఇప్పుడో మరి, ఆమె కదలలేనిస్థితిలో మంచంలో పడిఉంది. ఇది అవకాశంగా తీసుకొని సరళ తన భర్తను ఎక్కడ వశపర్చుకుంటుందో అని ఆమె భయం; ముఖ్యంగా ప్రస్తుతం ఆమెను బాధిస్తున్నవిషయమే యిది. అందువల్ల సరళనుచూస్తేనే నీరజ ఈనాడు అమితంగా ద్వేషిస్తుంది.

స్త్రీది సందేహాత్మక స్వభావం. అదీగాక భర్తను గురించి సందేహించటం మరింత సహజ లక్షణం. ఈనాడు నీరజ మానసికస్థితికూడా అలాగే తయారయింది. ఆదిత్యుడు పరస్త్రీ వ్యామోహంలో పడిపోతాడేమో అని నీరజ సందేహించసాగింది. సరళ వచ్చినప్పటినుంచి ఆమె సందేహం మరింత బలపడసాగింది. సరళ తన జీవిత సర్వాన్ని దోచుకుంటున్నట్లు ఆమె తలపోసేది. కాని, ఆదిత్యుని స్వభావం ఎలాంటిదో తనకు తెలుసును గనుక నీరజ తనను వేధిస్తున్న అనుమానాన్ని పైకి వ్యక్తం చేయలేదు. తనను చాలాజబ్బుస్థితిలో వదిలేసి ఆదిత్యుడు మరొకస్త్రీని ప్రేమిస్తాడని ఆమె విశ్వసించలేకపోతుంది. కాని, సరళయందుకలిగిన అనుమానం మాత్రం ఆమె మనస్సులోనుండి తొలగిపోలేదు. ఇదే సిగ్గు, దైన్యమూ ఇదే; ఇదొక రహస్యం.

మధ్యాహ్న సమయమయింది. పనివాళ్ళు తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. పూరికోటలో ప్రశాంతంగా ఉంది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో నీరజ శూన్యదృష్టితో తనహృదయాన్ని అవలోకించ సాగింది.

## 2

'రోషినీ!' అంటూ నీరజ దాదిని కేకేసింది.

రోషినీ బక్కచిక్కి ఎముకలగూడులా ఉంటుంది; తల సగభాగం నెరిసింది. దాసీలందరివలెనే రోషినీకూడ సహజంగా లంగా ధరించి, నెత్తిమీద ముసుగు వేసింది. చేతులకు లావాటి ఇత్తడిమురుగులు ఉన్నాయి. ఆమె ముఖంలో మృదుత్వం కన్పించదు. హృదయంలో ఏదో తీరని బాధను అనుభవిస్తున్నట్లుంది. నీరజకు జబ్బుగా ఉండటమే అందుకు కారణం. దాది రోషినీ చేతులుమీదనే నీరజ పెరిగి పెద్దదయింది. వివాహమై నీరజ అత్తవారింటికి వస్తున్నప్పుడు రోషినీ కూడా ఆమెవెంట ఆదిత్యుని ఇంటికి వచ్చేసింది. నీరజను కనిపెట్టుకొని ఉండటమే ఆమె ఉద్దేశ్యం. అన్నిటికంటే పెంచిన మమకారం చాలాగొప్పది. అందుకనే రోషినీ నీరజను వదలి ఉండలేకపోయింది. నీరజకు ఏమాత్రం కష్టం కలిగినా రోషినీ విలవిల్లాడి పోయేది. నీరజమంచంపట్టిన తరువాత రోషినీ ఎంతో వ్యాకుల పడసాగింది. నీరజత్వరగా ఆరోగ్యవంతురాలై లేచితిరగాలని దేవుళ్ళకు, దేవతలకు మొక్కుకోసాగిది. రోజురోజుకూ నీరజ ఆరోగ్యం క్షీణించటంచూచి రోషినీ ఆదిత్యునిమీద,డాక్టర్లు-నర్సులమీదా కోప

గించుకో సాగింది, చివరకు తనమీద కూడా ఆమెకు కోపంవచ్చేది.

రోషినీ గదిలోకివచ్చి నీరజ తల నిమురుతూ ఎంతో ప్రేమ కనబరుస్తూ 'ఏం కావాలమ్మా?' అని అడిగింది.

'ఏమీ లేదు. కాస్సేపు కూర్చొని కబుర్లు చెప్పు' అని అంది నీరజ.

రోషినీ ఆమె ప్రక్కనే కూర్చుంది.

'ఇవాళ ఉదయం అందరూ త్వరగా నిద్రలేచా రను కుంటాను' అని అంది నీరజ ఏదో ఉత్సాహంతో.

రోషినీ జవాబేమీ చెప్పకుండా మెదలకుండా కూర్చున్నది. కానీ, నీరజ ముఖభావాన్నిచూచి ఆమె ఆ ప్రశ్న అడగటంలోగల ఉద్దేశ్యాన్ని రోషినీ గ్రహించింది. రోగశయ్యమీద ఉండి నీరజ ఇంటి వ్యవహారాలన్నీ గమనిస్తూ ఉందని రోషినీకి తెలుసు.

'రోషినీ! ఆయన ఇవాళ తెల్లవారుజామునే లేచిన ట్లుంది. తలుపుతెరిచిన చప్పుడు విన్పించిందిలే. సరళను వెంట బెట్టుకొని తోటపనికి వెళ్లారుగదూ?' అని అడిగింది నీరజ.

సరళ వారింటికి వచ్చినప్పటినుంచీ, ఆమె ఆదిత్యునికి అన్నిపనుల్లోనూ సహాయపడుతూ ఉండేది. వాళ్ళిద్దరూ తెల్లవారుజామునే లేచి ఆనాడు చేయాల్సిన పనులనుగూరించి నిర్ణయించుకునేవారు - ఈ విషయం నీరజకూ తెలుసు, రోషినీకి తెలుసు. ప్రతిరోజూ జరుగుచున్నదే ఇది. దానిని గురించే నీరజ ప్రశ్నించినప్పుడు దాది జవాబు చెప్పలేదు. అందుకు కారణం లేకపోలేదు. నీరజ హృదయంలోని బాధ

రోషినీకి తెలుసు. అది సహజమైనదికూడా ఆమె ఉద్దేశ్యం అందుకని ఏమీ జవాబు చెప్పలేదు.

దాది జవాబు చెప్పనప్పటికీ నీరజ లెక్కచేయలేదు. అంతేకాదు దీనినిగురించి దాది అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలనికూడా ఆమె ప్రయత్నించలేదు. బయట శూన్యంలోకి చూస్తూ నీరజ మాట్లాడ నారంభించింది.

'ఒకప్పుడు ఆయన నన్నుకూడా ఇలాగే తెల్లవారు జామున నిద్రలేపి తోటపనికి తీసుకవెళుతూ ఉండేవారు, ఆ రోజున చేయించాల్సిన పనులేమిటో చెబుతూ ఉండేవారు-అవి నిజంగా ఎంత మధురమైన రోజులు!' అని నీరజ నిట్టూర్చింది.

ఆ నిట్టూర్పులో ఎంత హృదయావేదన యిమిడివుందో గమనించిన రోషినీ త్రుళ్ళిపడింది. ప్రేమతో ఆమె నీరజకు ధైర్యంగొల్పుతూ ఇలా అంది.

'అమ్మా! దైవకృపవల్ల ఆ రోజులు మళ్ళీ త్వరలోనే వస్తాయి; చింతించకు! నీ భర్తతో కలిసి మళ్ళీ ఎప్పటివలె తోటపనులు చూసుకుంటావు. ప్రస్తుతం ఆ పనులన్నీ సరళ చూసిఉండకపోతే ఈపాటికి తోట ఎండిపోయేది. ఇంకెవరున్నారమ్మా మరి? అదీగాక, సరళకూడా చాలా శ్రద్ధగా తోటపనులు చూస్తుంది. తానూ ఎంతో శ్రమ చేస్తుంది.'

రోషినీ మాట్లాడుతున్నదేకాని నీరజ ఆమె మాటల్ని వినటంలేదు. ఆమె తన ఆలోచనల్లో మునిగిపోయింది. అలా ఆలోచనాసముద్రంలో మునిగిఉన్న నీరజ మళ్ళీ రోషినీతో చెప్పసాగింది.

'రోషిణీ! ఇవాళ తెల్లవారుజామున గుర్రబ్బండివచ్చిన చప్పుడు వినిపించింది. ఎప్పటివలె ఇవాళకూడా పూలు మార్కెట్టుకు వెళ్ళారా? ఆపని ఒకప్పుడు నేను చేసేదానిని; ఇప్పుడు ఆపనిని ఎవరు చూస్తున్నారు?'

కానీ, దాదిఇందుకేమి జవాబుచెప్పలేదు. ఈప్రశ్నకు జవాబుచెబితే సరళ పేరు ఎత్తాల్సివస్తుంది; సరళపేరు వింటే నీరజ ఉద్రేకపడవచ్చు,కనుక జబ్బుగాఉన్ననీరజకు ఉద్రేకం కలిగించే విషయాలు మాట్లాడటం మంచిదికాదని ఆలోచించే రోషిణీ జవాబు చెప్పలేదు.

రోషిణీ జవాబు చెప్పనప్పటికీ నీరజ తనధోరణిలో తాను మాట్లాడుతునే ఉంది.

'నేను అజమాయిషీ చేస్తున్నరోజుల్లో దొంగతనాలు వగైరా ఏమీ జరిగేవికావు. పనివాళ్ళకు అందుకు వీలు చిక్కేదే కాదు.'

ఈవిషయంలో రోషిణీమనస్సు నీరజతో ఏకీభవించింది. ఆనాటికీ ఈనాటికీ ఉన్నతేడానుగురించి రోషిణీ ఆలోచించసాగింది. ఈనాటిపరిస్థితులు గుర్తొచ్చేసరికి ఆమెకు చాలా కోపంవచ్చింది. కానీ, ఆభావాన్ని పైకి వ్యక్తం కాని వ్వకూండా పైకిఎంతో ప్రశాంతంగా ' అమ్మా! ఇప్పుడ వన్నీ తలక్రింద య్యాయి. ఇప్పుడు ఎవరికి అందినది వారు రెండు చేతులా దోచుకుంటున్నారు' అని అంది.

రోషిణీ మాటలువిని నీరజ త్రుళ్ళిపడి 'ఏమిటీ!' అంది బాధపడుతూ.

తాను చెప్పినమాటల్ని మరింత స్పష్టంచేస్తూ రోషినీ ఇలా చెప్పసాగింది.

'పూలన్నీ మార్కెట్టుకు అమ్మకానికి వెళ్ళుతున్నాయనే అనుకుంటున్నావా? అల్లుడుగారు అటు మార్కెటుకు వెళ్ళటం ఆలస్యం, ఇటు పనివాళ్ళు ఎవరికి తోచినన్ని వాళ్ళ తట్టల్లో దాచుకుంటారు. రకరకాల పూలన్నీ దొంగిలించి చాటుగా అమ్ముకుంటారు.'

ఆమాటలు విని నీరజకు చాలదుఃఖం కలిగింది.

'అలా ఎందుకుజరుగుతుంది రోషినీ? చూసేవారెవరూ లేరా?'

'ఇవన్నీ ఎవరికి కావాలమ్మా! అయినా ఎవరున్నారు గనుక?'

'ఇలా జరుగుతూఉంటే వారితో చెప్పలేక పోయావా? తప్పకుండా చెప్పి ఉండాల్సింది.'

'నీమాటలు మరీ బాగున్నాయమ్మా! అలాచెప్పిఉన్న మర్యాదను కాస్తా పోగొట్టుకోవాలి. వాళ్ళందరూ ఒకటి, నేనొక్కదానినే ఒకటి. నామాటలు నమ్ముతారా, నువ్వే చెప్పు! నువ్వు యజమానురాలివి గనుక నీసంగతి వేరు.'

రోషినీ మాటలువిని నీరజకు చాలా కోపంవచ్చింది. హృదయంలో శూలంతో పొడిచినట్లనిపించింది. అయినా, నీరజ నిగ్రహం వహించి వైరాగ్య భావంతో ఇలా అంది.

'అవును! ఏ దెలా తగలబడితే నాకేం! మధ్యలో నువ్వెందుకు చెడ్డదానివనిపించుకోవాలి? జరిగేదెలాగూ జరక్కమానదు. అలాగే జరగనివ్వు, ఉన్నదికాస్తా హరించుకు

పోయిన తరువాతగాని ఆయన కళ్ళు తెరిచి చూడరు. ఆ రోజూ త్వరలోనే వస్తుంది. పండంటిసంసారం చితికి శిథిల మయ్యేరోజొచ్చింది. ఆ తరువాతగాని ఆయనకు నా విలువ అర్థంకాదు. తనవాళ్ళకు, పరాయివాళ్ళకు ఉండే తేడా ఏమిటో అప్పుడు బోధపడుతుంది ఆయనకు. ఇప్పుడు మనం ఏమిచెప్పినా ఆయన చెవికెక్కదు పైగా మనం చెడ్డవాళ్ళం అవుతాము.'

'ఏమనుకుంటే ఏం లాభం? వాడు. ఆ హరియా లేడూ, వాడిసంగతి చూడరాదూ? వట్టి పనికిమాలిన వెధవ. వాడికి పనిచేయటమే రాదు. వాడిని చూస్తేనే నాకు వళ్ళు మండుతుంది' అని రోషిణీ తన మనసులో వున్న అక్కసును వెళ్ళగక్కింది.

నిజంగానే వాడు పనికి దొంగ; కానీ రోషిణీ వాడిని ద్వేషిస్తుంది అందుకేనా? వాడు పనిచేయకుండా బుకాయిస్తాడనేసంగతి అందరికీ తెలుసు. ఇప్పుడు దానినిగురించి క్రొత్తగా దాదికి వాడిమీద కోపం ఎందుకో? దానికి కారణం వేరే వుంది. నీరజను చిన్నప్పటినుంచి తాను పెంచింది. ఆమెమీద తనకు పూర్తి అధికారం వుంది; ఆమె ఆదరాభిమానాలకు తానే అర్హురాలు; కానీ, ఇంతలో ఈ హరియా దాపరించాడు; వాడు ఇక్కడికి వచ్చిననాటినుంచి నీరజ వాడిని చాలా ఆదరి స్తుంది; రోషిణీ అది భరించలేకపోయింది. ముందు వచ్చిన చెవులకంటె వెనకవచ్చిన కొమ్ములు వాడి అన్నట్లుగా హరియా నీరజ ఆదరాభిమానాలు చూరగొనటం ఆమెకు

మంటగా వుంది. ఇప్పుడు హారియానుగురించి రోషినీ చెప్ప టానికి కారణం అదే.

హారియానుగురించి చెడుగా చెప్పటానికి రోషినీకి ఇంత కంటె మంచిఅవకాశం ఎప్పుడూ దొరకలేదు. కానీ, ఆమె వుద్దేశ్యం నెరవేరలేదు. నీరజ శాంతస్వరంతో ఇలా అంది: 'రోషినీ, పనివాళ్ళను అని ఏం లాభం? వాళ్ళచేత చేయించే వారిది ఆ తప్పంతా. నిజం చెప్పాలంటే, హారియా జీవిత మంతా తోటమాలిగానే గడిచిపోయింది; ఇప్పుడు ముసలివా డయ్యాడు. అందుకని ఎవరైనా అర్థంలేని మాటలు మాట్లా డితే వాడు సహించలేడు. అదీగాక చెల్లెలు సరళమ్మకు పుస్తకజ్ఞానం వున్నదేకాని అనుభవం లేదు; ఆమెగారు ఆ పుస్తకాల ఆధారంతో తోటపనులు జరిపించాలనిచూస్తుంది. ఇక ఇటు హారియా వుద్రేక స్వభావం కలవాడు; తలాతోకా లేని సరళమాటల్ని లెక్కచేయడు; ఎదురుతిరిగి మాట్లా డుతూ వుంటాడు. తరువాత ఆ సంగతులన్నీ నాతో చెప్పి పోతూ ఉంటాడు. అటువంటిమాట లేవీ పట్టించుకోకుండా నీ కేది మంచిదనితోస్తే అలాగే చేస్తూవుండమని నేనే అత నితో చెప్పాను. వాడికి ఏపని చేయాలో బాగా తెలుసు. వాడికి మరొకరు చెప్పాల్సిన అవసరం లేదు..

నీరజ వాడిపక్షాన మాట్లాడటం రోషినీకి రుచించ లేదు. వాడిపట్ల ఆమెకున్న సదభిప్రాయాన్ని పోగొట్టాలనే వుద్దేశ్యంతో 'నిన్న అల్లుడుగారు వాడిని పనిలోనుంచి తీసి వేశారు' అని చెప్పింది రోషినీ.

నీరజ హృదయంలో ఆ మాటలు శూలంవలె గుచ్చుకున్నాయి. ఆమె త్రుళ్ళిపడి "ఏం జరిగింది? వాడు చేసిన తప్పేమిటి?" అని అడిగింది.

చెప్పటానికి అవకాశం దొరికే సరికి రోషినీ ఒకటికి నాలుగు కల్పించి చెప్పసాగింది: "ఏం జరిగిందేమిటమ్మా! మంచి పనే జరిగింది. అల్లుడిగారి తప్పు రవ్వంత కూడా లేదు. వాడు నిన్న కడుపు నిండా మెక్కి పనీ పాటా లేకుండా బీడీ కాల్చుకుంటూ కూర్చున్నాడు. వాడి కళ్ళ ఎదుడనే ఆవు వచ్చి తోటలోని పూల మొక్కల్ని తినేయసాగింది వాడు చూస్తూకూర్చున్నాడే తప్పదానిని అదలించనైనా లేదు. అప్పుడుఅల్లుడుగారు ఇది చూచి భరించ లేక ఆవుతోటంతా అలా పాడుచేస్తుంటే చూస్తూ కూర్చున్నావేంరా; దానిని అవతలికి తోలు అన్నారు. అందుకు హరియా ఏమన్నాడనుకున్నావ్! 'ఇది చాలా పొగరు బోతు ఆవు, దగ్గరకు వెళ్ళితే చంపేస్తుంది; నేను మాత్రం వెళ్ళను. ప్రాణాలంటే నాకు మాత్రం తీపి లేదనుకున్నారా? అన్నాడు. ఇంత తల బిరుసుగా మాట్లాడితే ఆయన మాత్రం ఎంత కాలమని సహిస్తారు! కోపం వచ్చింది కానీ నువ్వు గుర్తొచ్చావో ఏమో కోపాన్ని కాస్త తమాయించుకున్నారు! వాడంటే నీకు దయ అని అల్లుడి గారికి తెలియదా ఏం!"

రోషినీ మాటలు విని నీరజ నవ్వసాగింది. తాను దయచూపుతున్న నౌకరు ఎంత దురుసుగా వాగినప్పటికీ తన భర్త తనకోసం అవన్నీసహించాడని విని ఆదిత్యునికి

తనమీద ఇంత ప్రేమఉన్నందుకు గర్వముతో ఆమెహృదయం ఉప్పొంగింది. కానీ, హరియా ఆదిత్యునికి పెడసరంగా జవాబు చెప్పాడని గుర్తొచ్చినప్పుడు అతనిని పనినుంచి తీసివేయుటమే మంచిదని అనుకుంది. అందుకే ఆమె చిరునవ్వు నవ్వుతూ ఇలా అంది; 'హరియా నిజంగానే చాలా సోమరిపోతు. మర్యాద మంచి తెలియని మూర్ఖుడు· ఎవరితో ఎలా మాట్లా డాలోకూడా తెలియదు. పడమటివాడనటంవల్ల వాడి మాటలుకూడా మోటుగా వుంటాయి ఏది ఏమైనప్పటికి, వాడు మరీ అంత అడ్డదిడ్డమైన మనిషి కాడు. అదీగాక ఇదంతా నేను నేర్పిందే గనుక వాడిదీ ఏమీ దోషం లేదు. పనిలోమాత్రం హరియా తెలివైనవాడనిమాత్రం చెప్పక తప్పదు.'

నీరజ ఈ విధంగా హరియాను పొగడటం రోషినీకి ఇష్టం లేదు, ఆ భావాన్నే వ్యక్తంచేస్తూ రోషినీ ఇలాఅంది: 'అమ్మా! నువ్వు లక్షచెప్పు. వాడింత తలబిరుసువా డవటా నికి కారణం నువ్వే. ఇటువంటివి నాకు నచ్చవుసుమా! అల్లుడుగారు మంచివాడుగనుక సరిపోయింది; నీకోసమని వాడిని ఏమీ అనలేదు. కానీ, వాడికి అలా మాట్లాడినం దుకు ఏ చీకూచింతా లేదు. నీమీదవుండే అభిమానంకొద్దీ వారు తోటపాడయినా సహించగలిగారు; హరియా దోషా లనూ మరిచిపోయారు.'

హరియాను నిందిస్తూ రోషినీ మాట్లాడినందుకు నీరజ కోపగించుకుని ఇలా అంది; 'చాలించు! చాలించు! హరి యానుగురించి నువ్వు మరేమీ చెప్పనవసరంలేదు. వాడం

టేనే అసలు నీకు గిట్టదు. హరియా తలుచుకుంటే తక్షణం పని వదలి వెళ్ళిపోగలడు. కానీ, వాడు వెళ్ళని కారణం ఏమిటో నీకు తెలుసా? నీకు తెలియదు, అతని మనసులోని బాధ నాకు తెలుసు; నువ్వు అర్థంచేసుకోలేవు.'

ఇంతలో హరియా తన గుడిసెలోనుంచి బయటకు వస్తున్నాడు. అతనినిచూసి నీరజకు ఆశ్చర్యం కలిగింది- 'గోపినీ, అడుగో! హరి యా అటు వెళుతున్నాడు. నొకసారి ఇలా పిలువు' అని అంది.

దాది కేకేసింది, హరియా యజమానురాలి గదిలోకి వచ్చాడు. రాగానే అతడునీరజకు నమస్కరించాడు. మనిషి చాలా నిరుత్సాహంగా కన్పించాడు-'పిలిపించారా అమ్మ గారూ?' అన్నాడు.

నీరజ నవ్వుతూ' విశేషాలేమిటి హరియా? మళ్ళీ కొత్తగా ఏమైనా ఆజ్ఞలు జారీచేశారా?' అని అడిగింది.

'ఆజ్ఞలకేం తక్కువమ్మా? రోజుకొక కొత్త ఆజ్ఞ జారి అవుతుంది. అవి వింటూఉంటే కోపంతో వళ్ళుమండు కొస్తుంది' అన్నాడు హరియా.

'ఇంతకూ అసలు విషయం ఏమిటో సూటిగాచెప్పు' అని అడిగింది నీరజ.

'ఇవాళ్టికివాళ ఏం ఆజ్ఞాపించారో వినండి. తోటలో ఎదురుగా కన్పిస్తుందే ఆయిల్లు కూలిపోయింది. సరళాబాయి గారు సలహా ఇచ్చారని అయ్యగారు పడిపోయిన ఇంటి రాళ్ళను చెట్లక్రిందపరచ్చమని ఆజ్ఞాపించారు. అలాచేస్తే వేసవి కాలంలో చెట్లుదెబ్బతిని పోతాయని ఎన్నిచెప్పినా నామా

టలు ఎవరువింటారు?'

నీరజముఖం చిట్లించి, మనస్సులో బాధపడుతూ 'హరియా, అయ్యగారికి నచ్చచెప్పలేకపోయావా?' అని అంది.

'అమ్మా! నేను అనేకవిధాల వారికి చెప్పాను. కానీ, వారు నామాట విన్పించుకోలేదు. పైగా నన్ను కసిరారు. అమ్మా, నిజం చెప్పాలంటే ఇక్కడ వుండటం నాకెంత మాత్రం యిష్టం లేదు. కానీ, మిమ్మల్ని వదలి ఎక్కడికి పోవాలి అనేదే నన్ను వేధిస్తున్న సమస్య.'

అతని మాటలువిని నీరజ క్షణకాలం శాంతంవహించి 'ఇవాళ రోజంతా ఇటుకలు మోస్తున్నారు అదేనా!' అని అడిగింది.

నీరజ మాటవిని హరియాకు కొంత ధైర్యం వచ్చింది. తాను చెప్పదలచుకున్నదేమిటో అతడు సూటిగా ఇలా చెప్పాడు: 'అమ్మా! మీఅజమాయిషీలో మాకే కష్టాలూ వుండేవి కావు. మీరు కళ్ళెర్ర చేసిచూస్తేనే మాకు భయంగా వుండేది. అదీగాక ఈ విషయం ఎంతవరకు సబబో మీరే ఆలోచించి చూడండమ్మా! పుట్టుకతోనే నేను తోటమాలిని. పూలమొక్కలను పెంచటమే మా వృత్తిగాని రాళ్ళురప్పలు మోయటం మాపని కాదు. ఆ పనిని మాకులంవాళ్ళు చాలా నీచంగా భావిస్తారు. ఆ స్థితిలో మా వాళ్లెవరైనా చూస్తే కులంలోనుంచి వెలేస్తారు. అప్పుడు మా గతేంకావాలో మీరే చెప్పండి.'

నీరజకు అంతులేని కోపంవచ్చింది. కొంచెం తమాయించుకొని 'సరే, అన్నీ చెప్పావుగా! ఇకనుంచి నీ పనే

మిటో నువ్వుచూసుకో. మరెప్పుడైనా నిన్ను రాళ్లు మొయ్య మని అంటే నేను వద్దన్నానని చెప్పు' అని అంది నీరజ హారియాతో.

నీరజ ఆమాట అన్న తరువాతకూడా హారియా అక్కడినుంచి కదలలేదు. అదిచూచి అతనితో 'హారియా! ఇంకా చెప్పవలసిం దేమైనా వుందా? నిలబడే వున్నావేం?' అని అడిగింది.

హారియా తల గోక్కుంటూ 'ఏమని చెప్పమంటారు! ఆ దేవునికి కూడా మామీద దయలేనట్లుంది. రోజంతా చాకిరీచేసిచేసి చస్తూఉంటే అటు ఇంటివద్దనుంచి వచ్చేఉత్త రాలు మనసును మరింత పాడుచేస్తున్నాయి. ఎద్దు ఒక్కటి చనిపోయిందని నిన్న నే ఉత్తరంవచ్చింది. ఏం చేయాలో, ఏమిటో ఏమీ తోచటంలేదు' అని చెప్పాడు.

అతని మాటలు విని నీరజకు నవ్వొచ్చింది. వెంటనే తలవైపునఉన్న సంచిలోనుంచి రెండురూపాయలు తీసి అతనికి ఇస్తూ 'దుర్మార్గుడా! మధ్య ఎద్దును చంపటం ఎందుకు! నీట క్కరి వేషాలు నాదగ్గరా! అద్దాలుమాని ఈ రెండు రూపా యలు తీసుకొని ఎద్దును బ్రతికించు' అని అందినీరజ.

రెండురూపాయలు తీసుకొనికూడా హారియా అక్కడి నుంచి కదల లేదు.

'ఇంకా నిలబడ్డావెందుకు? డబ్బు దొరికిందిగా, వెళ్లు' అని అంది నీరజ.

'అంతా మీదయ! ఒక పాతచీరఉంటే ఇప్పించం డమ్మా. ముసలిదానికి కట్టుకోటానికి బొత్తుగా ఏమీలేదు.

చాలా ఇబ్బంది పడుతుంది... అని హరియా ముసిముసి నవ్వులు నవ్వాడు.

నీరజ వెంటనే దాదినిపిలిచి 'రోషినీ, అదుగో అక్కడ పడివున్న ఆ చీరను హరియాకు తెచ్చివ్వు. చీర ఇవ్వకపోతే కదిలేట్లులేడు' అని చెప్పింది.

అది చాలా విలువైన ఢకా్కమజిలిన్ చీర. రోషినీ ఆ చీరను చూపిస్తూ 'అమ్మా, అది నీఢకా్క చీర!' అనిఅంది.

ఢకా్కదే! అయితేఏం?ఇవ్వు' అందినీరజనిర్లక్ష్యంగా.

'చాలా బాగుంది! మనసుకు ఎంతతోస్తేఅంత, వెనకా ముందూ ఆలోచించనేలేదు. నా కళ్ళఎదుట ఇలాంటివి జరగటానికి వీల్లేదు. అంతగా ఇవ్వాలి అనుకుంటే మిల్లుచీర ఏదైనా ఇవ్వమ్మా!' అని అంది రోషినీ గట్టిగా.

దాదిమాటలువిని హరియా నీరజతో 'చూశారా, అమ్మగారూ! నేనంటే ఈమెకు ఎంత కోపమో! అంతా నా దురదృష్టం; మీరు మంచం ఎక్కారు; అందరూ నాకు వ్యతిరేకులే' అని అన్నాడు.

'అదేమీలేదు హరియా! రోషినీకి నువ్వంటే చాలా ఇష్టం. ఇంతకుముందు నిన్నుగురించే చాలా గొప్పగా చెబుతూ ఉంది' అని అంది నీరజ అతనితో.

'రోషినీ! ఆ చీర హరియాకు ఇవ్వు. ఇచ్చేవరకు వాడు నన్ను వేధించుకుతింటాడు ఇచ్చిపంపు' అని అంది నీరజ దాదివైపుతిరిగి.

రుసరుసలాడుతూ దాది ఆ చీరను హరియామీదికి విసిరేసింది. హరియా అడగకుండానే అక్కడవున్నరుమాలు

అందుకొని చీరను దానిలో చుట్టుకొని నీరజకు నమస్కరించి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

హరియూ అటు వెళ్ళగానే రోషినీవైపు తిరిగి 'మీ బాబు గారు ఇంట్లో లేరా?' అని అడిగింది.

'బయటకు వెళ్ళారమ్మా!' అని చెప్పింది దాది.

'ఆయన వెళ్ళటం నువ్వు చూశావా?'

'నేను చూడకపోవటం ఏమిటి, నా ఎదుటినుంచేగదా వెళ్ళారు! చాలా విచారంగావున్నట్టు అగుపించారు. నెత్తి మీద టోపీకూడా లేదు.'

నీరజహృదయం దడదడ కొట్టుకుంది.

'రోషినీ! ఇలా ఆయన నన్ను ఉపేక్షించటం ఇంతకు ముందెప్పుడూ జరుగలేదు. నేను రోగంతో మంచంలో పడి వున్నానుగనుకనే నాయందు విముఖత చూపారు. మరి కొంత కాలం ఇంకా నేను ఇలాగేవుంటే మరింత నిర్లక్ష్యంగా చూస్తారు వారి దర్శనమే దుర్లభం అవుతుంది. నాఇంట్లోనే నాకు 'నా' అనేవాళ్ళెవరూ లేకుండా పోయారు.'

ఇంతలో తలుపు తెరుస్తున్న చప్పుడయింది. సరళ గదిలోకి వచ్చింది. ఆమెను చూడగానే దాది మూతిముడుచుకొని చరచర బయటకు వెళ్ళిపోయింది. నీరజ సరళవైపే చూడసాగింది. సరళ కొంచెం పొడవుగా వుంటుంది, శ్యామవర్ణ శరీరం; దయారసం తొణికిసలాడే విశాల నేత్రాలు. ఖద్దరుచీర ధరించింది. తలదువ్వి ముడివేసింది; ముడి భుజం మీదికి వ్రేలాడుతూ వుంది.

సరళ వస్తూ మేలైన రకరకాల పుష్పాలతో అంద ముగా ఒక గుచ్ఛాన్నికట్టి తెచ్చింది. సరళనూ, ఆమె చేతి లోని పుష్ప గుచ్ఛాన్ని చూసింది నీరజ. నిత్యమూ నీరజగదికి ఆదిత్యుడు పుష్పాలు తెస్తూఉండేవాడు. ఇవాళ ఆ దిత్యుడు ఇంటివద్ద లేడుగనుక సరళ తీసుకొనివచ్చింది. కానీ, నీరజ మరొకరు తెచ్చిన పుష్పాలను స్వీకరించటానికి సిద్ధంగాలేదు. నీరజ మౌనంగా చూస్తూ పడుకొనిఉంది సరళ ఆ పుష్ప గుచ్ఛాన్ని పూలకూజాలో అలంకరించి అక్కడే నిలబడింది.

'ఈపుష్పాలను ఎవరు తెమ్మన్నారునిన్ను?' అని నీరజ గద్దించింది. ఆమె కంఠస్వరం అతిక ఠోరంగా విన్పించింది.

'బావగారు చెప్పివెళ్ళారు' అని సరళజవాబుచెప్పింది.

'వారే ఎందుకురాలేదు?'

'తొందర పనివల్ల బజారునకు వెళ్ళారు. ఉదయం టీ త్రాగగానే వెళ్ళిపోయారు.'

ఒకసారి ఇక్కడికివచ్చి వెళ్ళటానికికూడా తీరిక లేనంత తొందర పని ఏముందో?'

'రాత్రి ఆఫీసులో దొంగలు జొరబడ్డారట. ఆ వార్త వినగానే తర్వగా బయలుదేరి వెళ్ళిపోయారు.'

'మనసులో ఉంటే నావద్దకువచ్చి వెళ్ళటానికి ఎంత సమయం కావాలి?'

'రాత్రి మీఆరోగ్యం అంత బాగుండలేదు; చాలా గాబరాపడ్డారు; అందుకని ఏ తెల్లవారుజామునో మీకు నిద్ర పట్టి వుంటుందనిఅనుకున్నారు. అప్పటికేమీగదిలోకివచ్చారు. అనవసరంగా మిమ్మల్ని నిద్రలేపి బాధపెట్టటంఎందుకు లేఅని

వెళ్ళిపోయారు. ఈ పుష్ప గుచ్ఛాన్ని మీకు ఇవ్వమని మరీ మరీ చెప్పి వెళ్ళారు.'

నీరజ జబ్బుతో మంచం ఎక్కిననాటినుంచీ,ఆదిత్యుడు తోటలోని మంచి పుష్పాలను ఏరి; రోజూ ఒక గుచ్ఛాన్ని స్వయంగా తెచ్చి నీరజకు ఇచ్చి వెళుతూ ఉండేవాడు. ప్రతి రోజూ నీరజ ఆసమయానికి ఆదిత్యుని రాకకై ఎదురుచూస్తూ ఉంటుంది. కానీ, ఇవాళ మామూలుకు భిన్నంగా జరిగింది; ఆదిత్యుడు నీరజను కలుసుకోకుండా బజారుకు వెళ్ళాడు. స్వయంగా తానువెళ్ళిఇచ్చే పుష్పగుచ్ఛంకోసం నీరజ ఎదురు చూస్తూ ఉంటుందని ఆదిత్యుడు గ్రహించిఉండడు. నీరజకు కావలసినది పుష్పాలే అయితే తోటలో ఎన్నిలేవు? ఆమె కోరినన్ని తెప్పించుకోగలదు! భర్తద్వారా బహూకరించబడిన పుష్పాలలో ఉండే మాధుర్యం మరెవ్వరో ఇచ్చిన పుష్పాలలో ఎలాఉంటుంది!

తనను ఆదిత్యుడు నిర్లక్ష్యం చేశాడనే భావం ఆమె హృదయంలో గాఢంగా హత్తుకు పోయింది. కోపంవచ్చింది.

'బజారుకు పంపితే ఈ పుష్పాలకు మంచిధర వస్తుంది. అనవసరంగా వీటిని ఇలా పాడుచేయటం ఎందుకు? బజారుకు పంపు. డబ్బువస్తుందిగదా!' అంది నీరజ.

ఆ మాటలు అంటున్నప్పుడు నీరజకంఠం దుఃఖంతో పూడిపోయింది. నోటివెంట మాటరాలేదు

సరళ నీరజయొక్క మానసికవ్యధను గ్రహించలేనంత తెలివితక్కువది కాదు. మాటతరువాత మాట పెరుగుతుంది గనుక అప్పుడు జవాబుచెప్పటం అంత మంచిదికాదని భావిం

చింది సరళ. దానివల్ల చాలా అనవసర ప్రసంగం పెరుగుతుంది. అది ఎవరికీ క్షేమకరంకాదు. సరళ బదులు చెప్పకుండా గదిలోనుంచి వెళ్ళిపోసాగింది. నీరజ ఆమెను పిలిచి ఆ పూల పేరేమిటి అని అడిగింది.

సరళ తన సహజధోరణిలో ఏదో ఇంగ్లీషు పేరు చెప్పింది. సరళ దానిపేరు చెప్పకుండా తనకు తెలియదంటేనే బాగుండేది, కానీ, ఆమెకు అంత తెలివి ఎక్కడిది? ఆ తెలివి తేటలేవుంటే నీరజఅభిప్రాయం ఏమిటో గ్రహించగలిగేది. నీరజ మరేదో పేరు చెప్పింది. ఆ పేరు వినగానే సరళ చిరునవ్వు నవ్వింది. కాదంటావా అని అడిగింది నీరజ. వాదన అనవసరం అనే అభిప్రాయంతో సరళ 'కావచ్చు' అనిఅంది.

సరళ సమాధానంవిని నీరజకు చాలా కోపంవచ్చింది.

'కావచ్చు! అంటే నీ వుద్దేశ్యం ఏమిటి? నేను చెప్పిన పేరు కాదనేగా! పూలవిషయాలు నాకేమీ తెలియవనీ, నేను తెలివితక్కువదాన ననేగా నీ అభిప్రాయం?' అనిఅంది నీరజ.

నీరజ కావాలనే తప్పుపేరుచెప్పి తనతో పోట్లాటకు తయారయిందనీ, అసలు నీరజ కోపానికిగల కారణం సరళ గ్రహించింది. ఇవన్నీ తెలిసిన తరువాతకూడా నీరజతో వాదనకు దిగటం వ్యర్థమనిభావించి సరళ తలవంచుకొని గదిలోనుంచి వెళ్ళిపోసాగింది. వెళుతూవున్న సరళను ఆపి నీరజ 'ఇవాళ ఉదయంనుంచీ తోటలో ఏంపని చేస్తున్నారు!' అని అడిగింది.

'పాదరిళ్ళు బాగుచేయిస్తున్నాను' అనిచెప్పింది సరళ.

ఆమాట వినగానే నీరజ మరింత మండిపడుతూ 'మాట్లాడితే పొదరిళ్ళు, పొదరిళ్ళు అంటావు. వాటిసంగతి నీ కెందుకు? అవంటే నీకు అంత సరదాగా వుందా ఏం?' అని అంది.

'ఎండిపోయిన లతల్ని తీసివేసి కొత్తలలిన్ని పాకించాల్సివస్తుంది గనుక తరచు ఆ పని చూడవలసి వస్తుంది' అని సరళ శాంతంగా జవాబు చెప్పింది.

నీరజ కోపంతో కంపిస్తూ ఆయాసపడుతూ ఇలా అంది- 'నేనుఎంతో శ్రమపడి చేసినవన్నీ మట్టిలో కలిపేస్తున్నారు. నువ్వు వచ్చినందువల్ల నష్టమేమీ లేదనుకో; అయినా ప్రతిపనికీ పెద్ద తెలిసినట్లు తయారవుతావు. ఆయన కూడా నీకు తగిపోయారు! ఎవరిచేత ఏపనులు చేయించాలో, ఏయే పనుల్లో ఎవరికి అనుభవంవుందో ఏమీ ఆలోచించరు. పొదరిళ్ళకు సంబంధించిన పనులు హరియా బాగాచేయగలడు. ఆవిషయాలు నేను అతనికి చక్కగా నేర్పాను; హరియాను ఆపనికి నియమిస్తే చాలాబాగా చేసి ఉండేవాడు.'

నీరజమాటలకు సరళ ఏమీ కోపగించుకోలేదు;ఎదురు జవాబు కూడా చెప్పలేదు. నీరజ ఉబితే హరియా పనిచేయ వచ్చునేమో కాని సరళ వచ్చిననాటినుంచి వాడు వళ్ళువంచి పనిచేయటమే మానేశాడు; తలబిరుసుగాకూడా మాట్లాడటం ప్రారంభించాడు తనను అవమానిస్తూ మాట్లాడినప్పుడుకూడా సరళ వాడిని ఏమీఅనలేదు. హరియా చాలా తెలివైనవాడు, పరిస్థితుల్ని వాడు లెక్కగా ఉపయోగించుకుంటున్నాడు. మంచం ఎక్కిన తరువాత నీరజలో వచ్చిన మానసిక బల

హీనతను గ్రహించి హారియూ సరళను, యజమానిని లెక్క చేయటమేలేదు. పైగా ఉన్నవీ లేనివీ కల్పించి నీరజతో చెబుతూ ఉండేవాడు.

నీరజ యొక్క ఆవేదన గ్రహించి నందువల్ల కూడా ఆమె మాటలు తనకు బాధకలిగించి నప్పటికీ సరళ ఏమీ మాట్లాడలేదు. సంతానంలేని దుఃఖాన్ని మర్చిపోటానికి నీరజ పూదోటను తన సర్వస్వంగా భావించి ప్రేమించేది ఇప్పుడు ఆ పూదోట పనులు తానేమీ చూడలేకపోతున్నందుకు నీరజ చాలా బాధపడుతుందనే సంగతి సరళకు తెలుసు.

తోట వంకతో నీరజ సరళను అనేకమాటలు అంది. సరళ మౌనంగా అన్నీ సహించింది. అప్పుడు నీరజ ఆమెతో సరళా, ఆకిటికీ మూసెయ్యి! ఎలా తగులబడితే నాకెందుకు! నేనిక తోటముఖం చూడదలుచుకోలేదు' అని అంది.

సరళ మారుమాటలేకుండా కిటికీ మూసివేసి' అక్కా పళ్ళరసం తీసుకుంటావా?' అని అడిగింది

నీరజ విసుక్కుంటూ 'వద్దు, నాకేమీవద్దు! నన్ను వేధించకండి' అని అంది.

'టైమయింది, మందు వేసుకోవూ?' అని అడిగింది. సరళ బెదురుతూ.

'ఎందుకు? ఈ మందులవల్ల ఏమీ ప్రయోజనంలేదు. నాకేమీ వద్దు, తోటలో ఇప్పుడు ఇంకా తమరు చేయవలసిన పనులు ఏమైనా మిగిలిపోయాయా ఏం?' అనిఅందినీరజ.

'గులాబీ మొక్కలకు పాదులు చేయాలి' అందిసరళ.

'అంటే ఇంతకుముందు ఆ సంగతి అసలు గుర్తే లేదన్న మాట! అయినా, ఇది గులాబిమొక్కలు వేసే కాలమని నీతో చెప్పిందెవరో?'

సమాధానం చెప్పటానికి సరళ ముందు కొంచెం సందేహించింది; కాని తరువాత సంభాళించుకొని 'మార్కెట్టులో విదేశీ గులాబీలకు చాలా గిరాకీవుందట. వర్షాకాలం వచ్చేసరికి పువ్వులు పూయించాలని బావగారన్నారు. నేను వద్దనిచెప్పినా విన్పించుకోలేదు' అని అంది.

'పాపం! వా రసలు నీమాటే వినటంలేదా! సరే, హరి యాను ఒకసారి ఇలాపంపు' అంది నీరజ.

సరళ అక్కడినుండివెళ్ళి హరియాను పంపింది. హరి యాను చూడగానే నీరజ ఉగ్రరూపం ధరించి 'వెధవజబ్బు, ఇది నా కెక్కడినుంచి దాపురించిందోకాని, దీనిమూలాన మీారు మరీ నెత్తికెక్కి కూర్చున్నారు. గులాబి మొక్కలు నాటి నీళ్లుపోయటానికి చేతుల్లో ముళ్ళువిరుగుతా యనుకున్నా వటరా హరియా! తలబిరుసు ఎక్కువయింది! సరళమాటంటే నీకు లెక్కలేకుండా పోయిందన్నమాట! ఆమె మాకు బంధువు, ఆమెను గౌరవించాలనే జ్ఞానంకూడా తెలియదా? కొలనుకు దక్షిణభాగాన చదునుచేసి గులాబిమొక్కలు నాటు. అయ్యగారు వచ్చేలోపల పనంతా పూర్తికావాలి; తెలిసిందా! జాగ్రత్త!' అని గబగబ మాట్లాడేసింది.

తాను జబ్బుతో మంచంమీాద ఉన్నప్పటికీ. తోట పట్ల పూర్వంవలెనే శ్రద్ధ చూపుతున్నట్లు భర్తగుర్తించాలనీ, అందుకు అతడు వచ్చేలోపల గులాబి మొక్కలన్నీ తన

ఆదేశానుసారం నాటించాలని నీరజ ఉద్దేశ్యం అందుకే ఆమె హరియాతో అంతగా నొక్కి చెప్పింది.

అన్నిపనులూ అలాగే పూర్తిచేస్తానని హరియా తల వూపుతూ 'అమ్మగారూ! మీ ఆజ్ఞప్రకారమే చేస్తాను. మీకోసమని హరసుందరునిగారి గ్రామంనుంచి కటకంలో తయారయిన పూలకూజా తెచ్చాను; ఇటువంటివి అంటే మీకు చాలా ఇష్టమని తెచ్చాను' అని చెప్పాడు.

నీరజ దానిని పరిశీలించిచూచి 'దీనిధరఎంత?' అనిఅడిగింది.

హరియా నీరజకు నమస్కారంచేస్తూ 'అమ్మా! నేను దరిద్రుడనే కావచ్చు; అంతమాత్రాన నాకుమంచీమర్యాదా తెలియవనుకుంటున్నారా? మీఉప్పుతిని బ్రతికేవాడను, దరిద్రుడను; కానీ ఈ చిన్నవస్తువుకోసం మీవద్ద డబ్బు పుచ్చుకునేటంత అల్పుడనుకాను. ఇది మీరు ఉంచుకోండి' అని అన్నాడు. వెంటనే హరియా పాతపూలకూజాలోని పూలు తీసి ఈ కొత్త కూజాలో అలంకరించాడు దానినియజమానురాలికి చూపిస్తూ తన గోడ వేదో చెప్పసాగాడు.

'అమ్మగారూ! మా మేనల్లుడి వివాహ విషయం మీరు మరచేపోయి ఉంటారు. మురుగులు ఇప్పిస్తానని మీరు మాట యిచ్చారు. వివాహం దగ్గర కొచ్చింది. ఏవో చౌకబారు గిల్టుమురుగులు ఇవ్వటం నాకు ఏమాత్రం ఇష్టంలేదు. గొప్పవారింట్లో పనిచేస్తూ అలాంటివిఇస్తే నలుగురూ ఏమనుకుంటారో మీరే చెప్పండి!'

హరియా ఎత్తుగడను నీరజ గ్రహించింది. కానీ, ఇప్పుడు ఆమె గులాబిమొక్కల్ని నాటించే విషయాన్నేఆలో

చిస్తూ ఉంది. అందుకని వెంటనే వాడితో 'అలాగే, ఆవిషయం నాకు గుర్తుంది. వివాహం ఇవ్వాళే కాదుగదా! ముందు వెళ్ళి నేను చెప్పిన పని పూర్తిచేసిరా' అని అంది.

హరియా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నీరజ రోషినీని పిలిచింది. రోషినీ గదిలోకి రాగానే నీరజ ఆమెతో ఇలాఅంది. 'రోషినీ, నా మనస్సంతాఏమిటో చికాకుగా ఉంది. ఏవేవో ఆలోచనలువచ్చి మనస్సును పాడు చేస్తున్నాయి. నామీద నాకేజాలి; చెప్పరానంత దుఃఖం, కోపం కలుగుతున్నాయి. అంతా అయోమయంగా ఉంది.'

'అమ్మా! లేనిపోని ఆలోచనలతో మనస్సును పాడు చేసుకోవద్దు' అని రోషినీ నీరజకు ధైర్యం చెప్పసాగింది.

నిరాశ, నిస్పృహలు చుట్టుముట్టగా దుఃఖభారంతో నీరజ అటుతిరిగి పడుకుంది. కాస్సేపాగి రోషినీతో ఇలా చెప్పసాగింది

'రోషినీ! నా అదృష్టం ఎలా ఉందో? నాజీవితం ఇదేమి ఇంత భయంకరమైన దుస్థితి ఏర్పడింది. నే నేవిషయమూ సరిగ్గా ఆలోచించే స్థితిలో లేను. జీవితమంతా చీకటిమయంగాఉంది. హరియా నాబలహీనతను గ్రహించి దాని నుంచి చక్కగా లాభం పొందటం నేర్చాడు. వాడు ఏమని ఆలోచిస్తున్నాడో ఏమో? ఒక్కసారికాదు, అనేకసార్లు; అనుక్షణం వాడు అవకాశంకోసం ఎదురుచూస్తూనే ఉంటాడు. వాడిని ఒకసారి ఇలాపిలువు. వాడిసంగతి ఏమిటో ఇవాళే తేల్చేస్తాను. వాడివక్రబుద్ధిని మరమ్మత్తు చెయ్యాలి.'

హారియాను పిలుద్దామని రోషిని లేచి నిలబడింది. అంతలోనే నీరజ మళ్ళీ 'ఇప్పుడువద్దులే' అని అంది. రోషినీ మళ్లీ అక్కడే కూర్చుంది.

# 3

కాస్సేపటికి ఆదిత్యుని పినతండ్రి కుమారుడు రమేశ్ నీరజ గదిలోకి వచ్చాడు. మంచంప్రక్కకువచ్చి నిలబడి' 'వదినా! ఇవాళ అన్నయ్యకు ఆఫీసులో చాలా పనిఉంది. క్షణంకూడా తీరికలేదు. ఇంటికి వచ్చేసరికి ఆలస్యం కావచ్చు ఇవాళ్టికి అక్కడే హోటలులో భోజనంచేస్తారట. అన్నయ్య కోసం మీరుఎదురుచూస్తూ కూర్చోనవసరంలేదు, త్వరగా రానందుకు మీరేమీ గాబరాపడవద్దని చెప్పమని చెప్పాడు' అన్నాడు రమేశ్.

నీరజ అతనికి కుర్చీ చూపిస్తూ కూర్చోమని సైగ చేసింది. రమేశుడు కూర్చున్నతరువాత నీరజ చిరునవ్వు నవ్వుతూ 'మరదిగారూ! ఈవార్త చెప్పటానికే మీరింత దూరం శ్రమపడి వచ్చారా? కబురుపంపటానికి ఆఫీసులో ఎవరూ నౌకర్లేలేకపోయారా? నీమనస్సునాకు తెలియదనుకుంటున్నావా? నువ్వు ఎందుకువచ్చావో నాకు తెలుసు' అని అంది.

నీరజ మాటల్లోనిగూఢార్థాన్ని రమేశ్ గ్రహించాడు; ఆమె ఎవరిని ఉద్దేశించి మాట్లాడుతున్నదో కూడా అతడు వూహించుకో గలిగాడు. అయితే, పైకి అటువంటి భావం కన్పించనీయకుండా చిరునవ్వు నవ్వుతూ 'ఆఫీసులో నాకున్న

స్వేచ్ఛ సౌకర్యాలకు ఎలాఉంటుంది. ఏదో ఒకవంకతో మీావద్దకు రావాలని ఎప్పుడూ ఎదురుచూస్తూ ఉంటాను. వదిన గారిని చూడాలనే నా తహతహ నిన్నక్కడికి లాక్కొస్తూ ఉంటుంది' అని అన్నాడు.

'నన్ను తెలివితక్కువదానినిచేసి ఆడిస్తావెందుకయ్యా! మరదిగారూ! మరపించి మాయమాటలు చెబితే నమ్మటానికి నేను పసిదాన ననుకున్నావా? దారితప్పి నావద్దకు వచ్చావేమో గాని లేకపోతే ఈపాటికి తోటలోనికి వెళ్ళాల్సింది గదూ? అక్కడ మీా... లతామండపంలో ఒక్కతే ఉండి ఉంటుంది! వెళ్ళు వెళ్ళు! ప్రేమ పాఠాలు అప్పగించు.'

'వదినగారూ! ఈ పూదోటకు మీారే దేవతలు! మీా కృపఉంటే అదే నాకు పదివేలు - సమస్తశుభాలు సమకూరుతాయి. మీా ఆశీర్వాదం కోసమే ఇక్కడికి వచ్చాను'.

ఈమాట అని రమేశ్ జేబులోనుంచి ఒక కథా సంపుటిని బయటకుతీసి భక్తి పూర్వకంగా నీరజకు సమర్పించాడు.

కథల పుస్తకాలు అంటే నీరజకు చాలాఇష్టం కథలపుస్తకం కంటికి కన్పిస్తేనే ఆమెకు ఎంతోసంతోషం కలుగుతుంది. రమేశ్ ఇచ్చిన పుస్తకమును అందుకొని పేరు చదివింది — 'కన్నీటి ముత్యాలు' - పేరు చాలా అందంగా ఉంది.

మరదీ; మీా... ఆమె సర్వకాల సర్వావస్థలయందూ నీ హృదయమందిరంలో నివసించుగాక! కలకాలం మీారిద్దరూ పరస్పర ప్రేమానురాగాలతో వర్థిల్లుదురుగాక!' అని నీరజ ఆశీర్వదించింది.

'వదినా, నిన్నొకసంగతి అడగనా?' అన్నాడురమేశ్.

'తప్పకుండా అడుగు' అని నీరజ నొక్కి పలికింది.

'ఇవాళ నువ్వు సరళను ఏమైనా అన్నావా?'

'ఏం? అసలు ఏంజరిగిందో సరిగ్గా చెప్పు.'

'మరేమీ లేదు. నేను ఇక్కడికి వస్తూ కొలనుఒడ్డున సరళను చూచాను. ఎందుకో చాలా విచారంగా, అన్యమనస్కంగా కూర్చొనిఉంది. ముఖం చూస్తే ఎందుకో బాధ పడుతున్నట్లు కన్పించింది. అదీగాక స్త్రీల మనస్సు చాలా సున్నితంగా ఉంటుంది - మీకు తెలియనిదికాదు; అంతలోనే సంతోషిస్తారు, అంతలోనే విచారపడతారు. అలా ఎందుకు ఉన్నావని అడిగినా ఏమీ జవాబు చెప్పలేదు.'

'ఇక్కడ ఆమెను ఎవరేమంటారు? మీ అన్నయ్య ఏమైనా కేకలేశారేమో?' అని అంది నీరజ.

'అలా ఎందుకు జరుగుతుంది వదినా? అన్నయ్యకు కోపంవస్తే పనివాళ్ళను అంటాడు. కానీ మిమ్మల్ని ఎందుకు అంటాడు' అన్నాడు రమేశ్.

'మరదీ! ఇప్పుడు ఆ విషయాలు ఎందుకుగానీ నేనొక సంగతి చెబుతాను వింటావా! నామాట విని వెంటనే సరళను పెళ్ళిచేసుకో. నువ్వుతప్పకుండా నామాట నిలబెట్టాలి, నామీద ఒట్టు. ఒక అమ్మాయిని ఉద్ధరించినవాడవూ అవుతావు, ఒక ఇంటివాడవూ అవుతావు. అంతేకాదు, నాకు తోడికోడలు వస్తుంది.'

'అమ్మాయిని ఉద్ధరించే విషయంలో నాకెటువంటి దిగులూ లేదు. అయితే, వివాహ తతంగాలంటే నాకెంత

మాత్రం రుచించవు. కానీ వివాహమనేది మాత్రం జరుగు తుంది.'

'శుభస్య శీఘ్రం' అన్నారు, ఇంకా ఆలస్యమెందుకు? అమ్మాయికి నీమీద మనస్సులేదా!'

'ఆ విషయం నన్ను అడగటం ఎందుకు; ఆమే నా జీవన సహధర్మచారిణి అని మీకు మాత్రం తెలియదా!'

ఈ విషయాన్ని గురించి చర్చలతో జాగుచేయటం నీరజకు ఎంతమాత్రం ఇష్టంలేదు. రమేశునిచేత ఆవిషయం వెంటనే ఒప్పించాలని ఆమెఉద్దేశ్యం. అందుకని నీరజ అతని చేతిని పట్టుకొని నొక్కుతూ 'మరదీ! ఆమె ముమ్మాటికీ నీభార్య అవుతుంది నేను బ్రతికి ఉండగానే మీపెళ్ళి జర గాలి. లేనట్లయితే చచ్చిన తరువాత దయ్యమై నిన్ను పట్టి పీడిస్తాను. తెలిసిందా!' అని అంది.

నీరజ ఆవేశంలో గట్టిగా మాట్లాడటం చూసి రమేశ్ కలవర పడ్డాడు. నిశ్చితమని తెలిసికూడా సరళను వెంటనే పెళ్ళి చేసుకోవలసిందని తనను నీరజ ఎందుకు తొందర చేస్తూందో రమేశ్ వూహించ లేకపోయాడు.

'వదినా! వయసులో నువ్వు నాకంటె చిన్నదానవై నప్పటికీ హోదాకు పెద్దదానివి. జీవితంలో నాకు కొన్ని ఆ దర్శాలు, ఆశయాలు ఉన్నాయి. నేను ఏపనిచేసినా వాటిని అనుసరించే చేస్తానని నువ్వు గ్రహించాలి. ఇక, నువ్వు అడి గినదానికి నే నేమిజవాబు చెప్పాలో, చెబుతానో కూడా నువ్వు వూహించుకోవచ్చు' అని అన్నాడు రమేశ్.

నీరజ తన పెద్దరికపు హోదాను ప్రదర్శిస్తూ 'నేను ఏది చెప్పినా నీమంచికోశే చెబుతాను. నీవు చెప్పతగిన దానిని గనుక వెంటనే సరళను వివాహమాడమని ఆదేశిస్తున్నాను. ఫాల్గుణ మాసంలో మంచి ముహూర్తాలు ఉన్నాయి, ఏదో ఒక్కటి నిశ్చయించు' అని అంది.

'వదినా, నువ్వనేదేమిటి? నాకీ ముహూర్తాలలో నమ్మకంలేదని నీకు తెలుసు! ప్రతిరోజూ నాకు శుభమైనదే. అదీగాక, ప్రస్తుతం నాకు వీలుపడదు. ఒకసారి ఆ కృష్ణజన్మ స్థానాన్ని దర్శించి వచ్చాను; మళ్ళీ ఏక్షణంలో వెళతానో నాకే తెలియదు. జైలుకుపోవలసినరాత రాసిఉంటే, అలాంటి వారికి వివాహముహూర్తాలు ఎలా కుదురుతాయి?'

'ఇప్పుడు జైలుకు వెళ్ళవలసిన పరిస్థితులుఏమొచ్చాయి! అదీగాక, జైలుకువెళ్ళటంఅంటే ఇప్పుడు ఆడవాళ్ళకుకూడా భయంలేదు, తెలిసిందా?'

'నా హృదయ సింహాసనాన్ని అధిష్టించవలసిన నా హృదయాధి దేవత నన్ను జైలుకు అనుసరించటం నాకు ఇష్టంలేదు.'

వదిన మరదులు ఈ విధంగా మాట్లాడుతూ ఉన్న సమయంలో సరళ హార్లిక్స్ కలిపితెచ్చి బల్లమీదఉంచింది. ఏమీ మాట్లాడకుండా అక్కడినుండి వెళ్ళిపోతూ ఉండగా నీరజ 'సరళా? కూట' అని పిలిచింది.

సరళ అక్కడే ఆగి ఇటు తిరిగింది. నీరజ ఆమెకు ఒక ఫోటో చూపిస్తూ 'సరళా! ఇది ఎవరిఫోటో!' అని అడిగింది.

సరళ ఫోటోవంకచూచి 'అది నాఫోటోయే'అనిఅంది.

'గుర్తించావన్నమాట! ఇదినువ్వు ఎప్పుడో పెదనాన్న గారి పూదోటలో పని చేస్తున్నసమయంలో తీసిన ఫోటో. అప్పుడు నీవయస్సు ఎంత అనుకున్నావ్, పదునాలుగుపదిహే నేండ్లు ఉంటాయేమో! చూడు, మహారాష్ట్రస్త్రీవలె గోచీ బిగించి ఉన్నావుకదూ?' అని అంది నీరజ.

'ఇది మీకు ఎక్కడదొరికింది?' అని అడిగింది సరళ. 'మీ బావగారిడ్రాయిరుసొరుగులో ఎప్పటినుంచోపడిఉంది.

ఇవాళ గుర్తొచ్చి తెప్పించాను 'అని నీరజఆఫోటోను రమేశ్‌కు చూపించింది.'

'మరదీ! నువ్వేచెప్పు, సరళలో అప్పటికీఇప్పటికీ ఎంత మార్పుఉందో? ఇప్పుడు చాలా అందంగా ఉందికదూ?' అని అడిగింది నీరజ.

'సరళ అప్పుడూ ఇప్పుడూకూడా నా దృష్టిలో ఒకటి గానేఉంది. ఆమెను ఎవరితోనూ పోల్చను'అన్నాడు రమేశ్.

అతని మాటల్లో సహజను వ్యంగం కన్పించినట్లుంది - 'మరదీ! అప్పటికీ ఇప్పటికి మార్పువమిటో నన్ను చెప్పమం టావా? సరళ ఆనాడు కోమలమైన మొగ్గ. ఇవాళ, ఆమె నవ వికసిత పుష్పం. తృష్టితభ్రమరములు వికసించిన ఈపు ష్పాన్ని పసికట్టాయి. వికసించిన ఆసుందరపుష్పం ఏ ప్రేమి కునకో తనలోని మధుర ప్రేమరసాన్ని అర్పించాలనుకుంటు న్నది. ఆభావతరంగాలను నేటియువకులు 'రోమాన్స్' అని అంటారు గదూ? నేను చెప్పేది నిజం కాదంటావా?' అని అంది నీరజ.

ఇదేమీ రుచించక సరళ అక్కడినుంచి వెళ్ళటానికి సిద్ధపడింది. నీరజ ఆమెను పిలిచి తన చెంత కూర్చోమని చెప్పింది.

'సరళా ఒకక్షణం ఇలా వచ్చి కూర్చో? పురుష నేత్రాలతో నిన్నొకసారి చూస్తాను. ఆహా! రమేశ్, సరళలో ఎక్కువ అందంగా ఉన్నదేదో, చెప్పు చూద్దాం' అని అంది.

'నాకు అన్నీ ఒకటే! ఎక్కువ తక్కువలు నాకేమీ తెలియవు' అన్నాడు రమేశ్.

మరదీ! నీకేమీ తెలియదు నిజంగానే! నీది మంద బుద్ధి. సరళనేత్రాలు ఎంత అందంగా ఉన్నాయో చూడు. ఆమె తన విశాలనేత్రాలతో ఒకసారి చూస్తే చాలు, ఏపురుషుడు ఆమెకు దాసానుదాసుడు కాడంటావ్? ఆమె ఎప్పుడూ ఇలాగే నాకు ఎదురుగా కూర్చొనిఉంటే ఆమె కన్నులనే చూస్తూ ఉండిపోవాలనికోర్కె కలుగుతుంది. చంద్రబింబము బోలిన ఆముఖసౌందర్యము, శంఖమును మరిపించు ఆమె కంఠస్థానము, ఎంతో ఆకర్షణగా ఉన్నాయి. దిరిసెన పువ్వు వలె కోమలమైన శరీరము! నడకలోని అందము! ఆహా!'

అని నీరజ సరళను వర్ణించటం విని రమేశ్ నవ్వుతూ 'వదినా! నువ్వు వర్ణిస్తున్న తీరునుబట్టి చూస్తే సరళను నువ్వు అమ్మకానికి పెట్టినట్లుంది' అన్నాడు.

నీరజ అతని మాటలను వినిపించుకున్నట్లులేదు. మళ్ళీ ఇలా చెప్పసాగింది - 'మరదీ, సౌందర్యాన్ని గుర్తించు నేత్ర జ్ఞానం లేదు నీకు సరళ బాహువులు ఎంత అందంగా ఉన్నాయో చూడు! కమలమువంటి కరములు! చేతివ్రేళ్ళు

ఎంతో సుకుమారమై మరెంతో అందంగా ఉన్నాయి మరదీ, నువ్వు కవివి కాదు గనుక నీకు కవిత్వమర్మములు తెలియవు. కావ్యనాయికతో సరిపోల్చగల అందాలరాశి సరళ!'

'నన్నేమి చేయమంటావు వదినా! నీవర్ణన విన్న తరువాత ఇక నేను మాట్లాడేదేమీ లేదు. నీ పరిశీలనా శక్తి మాత్రం చాలా మెచ్చుకోదగినది.'

'ఇదంతా తెలిసిన తరువాతకూడా ఈ కుసుమకోమలి కరకమలాలను నీ చేతుల్లోకితీసుకోటానికిసందేహిస్తున్నావా?'

'వదినా ఒక్కమాట మాత్రం నిజం! ఆమె సుందర సుకుమార హస్తాలనుంచి సర్వదా ఇంతటీ, ప్రసాదము లభిస్తూ ఉండాలని నా కోర్కె. అదే నాకు పరమానందంగా ఉంటుంది. ఆ సుందరసుకుమార హస్తాలతో పెట్టే ఆహారపానీయాల మాధుర్యాన్ని తలచుకుంటూ భావనాలోకంలో మునిగిపోతాను. కానీ వాటిని నా స్వంతం చేసుకోవాలనే కోర్కె నాకు ఇంతవరకు కలుగలేదు. లభించినదానితోనే సంతృప్తి చెందాను. అంతే, ఇంతవరకు మరోవిషయమే ఆలోచించలేదు.'

సరళ వెళ్ళటానికని లేచి నిలబడింది. రమేశ్ చివాలున లేచి ఆమెకు అడ్డొస్తూ'నాకు మాటఇస్తేనే నువ్వు ఇక్కడి నుంచి వెళ్ళగలుగుతావు' అని అన్నాడు.

'దేనిని గురించి? 'అని అడిగింది సరళ.

'ఇవాళ నీవెంట తోటలోకివచ్చి నా హృదయంలో ఉన్నదంతా నీతో చెప్పుకొని హృదయభారాన్ని తీర్చుకోవాలను కుంటున్నాను' అని అన్నాడు రమేశ్.

'అలాగే రండి' అని అందిసరళ. రమేశ్ సరళకు దారిచ్చాడు. ఆమె వెళ్ళిపోయింది.

'వదినా; ఇకనాకు సెలవిప్పించండి' అన్నాడు రమేశ్.

'అంతే! ఇకనాతో అవసరమేముంది! మాట ఇచ్చింది గదా; వెళ్ళు, వెళ్ళు' అని అంది నీరజ.

రమేశ్ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

# 4

గదిలోనుంచి అందరూ వెళ్ళిపోయినతరువాత నీరజ ప్రశాంతంగా కళ్లుమూసు కొని పడుకుంది. ఇప్పుడు ఆమె మనస్సుకు శాంతి లభించినట్లుగా ఉంది. తన జీవితంలో కూడా ఆమె ఇలాంటి మధురమైన కాలం గడిపింది. వసంత మధుర సమీరాలను వెన్నెల రాత్రులను గురించిన అనేక మధుర స్మృతులు ఆమె మదిలో మెదిలాయి. ఆరోజుల్లో తాను ప్రేమమూర్తి యగు తన భర్త గుండెలపై తలపెట్టు కొని తీయని కలలు కంటూ నిద్రించేది. ఆమెకు భర్తనుంచి అమృత సమానమగు ప్రేమ లభించింది అనేకసార్లు ఆదిత్యుడు ప్రేమ తన్మయత్వంలో నీరజ ముఖంలోకి చూస్తూ, ఆమె ముంగురుల్ని వరిస్తూ ఆమె సౌందర్యాన్ని ప్రశంశిస్తూ ఉండే వాడు—'దేవీ! హృదయాధి దేవీ! భగవంతుడు దయతో ప్రసాదించిన అమృతమూర్తివి నువ్వు! మహాకవి కాళిదాసు తన ప్రేమ మూర్తిని గురించి వూహించుకున్నాడేకాని నువ్వు నాకు సాక్షాత్కరించావు. నీ మధుర దరహాసంతో నా

పూదోటలోని పుష్పాలు వికసిస్తున్నాయి. వసంత మధుర సమీరము వలె నువ్వు నాహృదయ తాపాన్ని తీర్చి శాంతి నిస్తున్నావు!'

కొంతకాలం క్రితం ఆమెజీవిత మధుపాత్ర భర్త ప్రేమ మధువుతో నిండి తొణికిసలాడుతూ ఉండేది. హాస పరిహాసాలతో, వినోద క్రీడలతో రోజులు హాయిగా దొర్లిపోతూ ఉండేవి. ప్రేమావేశంతో జోడు తుమ్మెదలవలె మధురఝుంకారముతో కాలము గడిపేవారు. వారి దాంపత్యజీవితము తీయని కలవలె పదిసంవత్సరాలు గడిచిపోయింది. అది ఎలా, ఎప్పుడు సమాప్తం అయిందో! ఆమె తనభర్త హృదయ సింహాసనాన్ని అధిష్టించి పరిపాలిస్తూఉండేది. ఆదిత్యుడు తన భార్యకొరకు ఆకాశంలోని నక్షత్రాలను తెచ్చుటకుసైతం సిద్ధంగా ఉండేవాడు. ప్రతిక్షణ ఆమెఇష్టప్రకారమే జరుగుతూ ఉండేది.

'ఇవాళ ఆ నాటి ఆదిత్యుడే, తానూ ఆ నాటి నీరజే కదా! రూపలావణ్య యవ్వనాలలోకూడా నాటికీ నేటికీ ఏమీ మార్పులేదు! కానీ... తన దురదృష్టం! ఆ తియ్యని రోజులు! ఆ వసంత సమీరాలు, ఆ వెన్నెల రాత్రులు! మధురమైన జీవన ప్రవంతిలో తేలిపోతూ గడిపిన ఆ రోజులు ఇవాళ ఏవి? కాలావాహినిలో ఎక్కడ, ఎలా కలిసి పోయాయో అంతు తెలియదు! పరిపూర్ణ సుఖ సంతోషాలతో తేలిపోయే ఆ మధురదినాలు అకస్మాత్తుగా, తెలియకుండా అంతరించిపోయాయి! నిర్దయుడగు విధాత మధురమగు ఆ జీవితపుటలను త్వరగా సమాప్తం గావించాడు. ఆ

రోజుల్లో తనలో ఉన్న చంచలత్వము, చలాకీతనముకూడా అంతరించిపోయాయి. ఇదంతా ఇలా ఎందుకు జరిగింది?' అని నీరజ తన గతజీవితాన్ని గురించిన ఆలోచనలతో సతమత మవుతూఉంది.

'భర్త నిత్యమూ ఏదో ఒక పనిలో లీనమై ఉంటు న్నాడు; నే నేమో ఒంటరిగా జబ్బుతో మంచంలో పడిఉంటు న్నాను. రోగపీడితమైన ఈ జీవితానికీ, మధురస్వప్నాలు కనే ఆరోగ్యకరమగు ఆ జీవితానికీ గలవ్యత్యాసం నాకు అవగత మయినంతగా మరెవరికీ తెలియదేమో?' అని నీరజ ఆలో చించసాగింది.

అవును, నిజమే! ఆమె మధురజీవితాన్ని అభిలషిం చేది, ఆమె సూక్ష్మగ్రాహి. ఇవాళ ఆమె రోగపీడితురాలు. స్వచ్ఛమైన ఆరోగ్యప్రవాహంలోనుంచి అకస్మాత్తుగా దుస్సహామగు అనారోగ్యపు ఇరుకు ప్రవాహంలోకి కొట్టు కొనివచ్చినప్పుడు కలిగే బాధ, అవాంఛనీయపరిస్థితులు' అనర్థాలు ఆమెకు పూర్తిగా అనుభవానికి వచ్చిఉంటాయి.

సరళ ఇక్కడికి వచ్చిననాటినుంచి నీరజహృదయంలో శూలం గ్రుచ్చుకుంటూనేఉంది. సరళ ఇక్కడికి వచ్చిఉండ టం తనకు శుభముకాదనీ, క్షేమంకాదనీ నీరజ భావించ సాగింది. సరళ చాలా శ్రమపడి పూదోటను చక్కగా సం రక్షిస్తూఉందని ఆదిత్యుడు నీరజతో చెబుతూ ఉండేవాడు; కానీ నీరజకు ఆ విధంగా అనిపించేదికాదు. సరళ తనజీవితపు పూలతోటమీద నిప్పులు చల్లుతుందని నిరజ అభిప్రాయపడ సాగింది. ముందుముందు సరళ తన జీవితమార్గంలో కంటక

ముగా తయారవుతుందని నీరజ ఎన్నడూ ఆలోచించలేదు. ఇవాళ సరళ ఆవిధంగా తయారయిందంటే నీరజ చేయగలిగే దేమున్నది? ఇప్పుడు ఆమెలో ఆలోచనాశక్తికూడా అంతగా లేకుండా పోయింది.

రకరకాల ఆలోచనలతో విచారగ్రస్తురాలై, వేదనా పూరితమగు మనస్సుతో కలవరపడుతూ నీరజ రోషినిని పిలిచింది.

'రోషినీ! ఒకసారి ఇలారా!'

దాదివచ్చి 'ఏంకావాలమ్మా?' అని అడిగింది.

'ఇలావచ్చి కూర్చో! నీతోమాట్లాడాలి' అంది నీరజ.

రోషినీవచ్చి కూర్చుంది. నీరజ ఇలా చెప్పసాగింది- 'రోషినీ! లోకం అతి విచిత్రమైనది సుమా! ఇప్పటికి పదిసంవత్సరాలకు పూర్వం నేను ఇంటికోడలిగా వచ్చాను. ఆరోజుల్లో వారునన్ను 'రంగమహల్ మహారాణీ' అనిపిలిచేవారు. ఇవాళ నేను ఆనీరజనే; వారూ ఆనాటివారే; కాని ఇప్పుడు అదంతా ఏమయింది?'

'అవేంమాటలు తల్లీ? నీకు జబ్బుచేసిందని అల్లుడుగారు చాలా బాధపడుతున్నారు. వారు నిన్ను పూర్వంవలె ప్రేమించటంలేదని ఎందుకు అనుకుంటున్నావ్? నీకోసం వారు ఎంత బాధపడుతున్నదీ నాకు తెలుసు' అని అంది రోషినీ.

'రోషినీ' నామనస్సుఎందుకనో ఏమీ బాగుండలేదు. పూర్వపు రోజులు తలపుకు వచ్చినప్పుడు నాబాధకు అంతుండదు. అప్పుడు మేమిద్దరమూ వెన్నెలరాత్రులందు ఈపూదోటలో విహరిస్తూఉండేవాళ్ళం. ఆనాడు అలా నిద్రలేకుండా

వారితో కలిసి కాలక్షేపం చేయటం ఎంతో మధురంగా ఉండేది; కానీ మేల్కొని ఉండటంలో ఈనాడు ఆమధుర్యం లేదు. నిద్రవచ్చినాకొంతసుఖంగా ఉండేదేమో, అదీరావటం లేదు. నిద్రకూడా నామీద పగసాధిస్తుందేమో!' అని అంది నీరజ.

'అమ్మా! కాస్సేపు కళ్ళుమూసుకొని పడుకోండి! నిద్ర అదేవస్తుంది' అని చెప్పింది రోషిణీ.

'రోషిణీ! వారూ, సరళ ఇద్దరూకలసివెన్నెల రాత్రులందు పూదోటలో తిరుగుతున్నారా?'

'అదేమో నాకు తెలియదు. కానీ ఉదయమే లేచి మార్కెట్టుకు పంపటానికి ఇద్దరూ కలిసి పూలుకోస్తూ ఉండటంమాత్రం చూశాను. అదీగాక, రాత్రులందు సరళమ్మ గారితో కలిసి తోటలో తిరగటానికి అల్లుడుగారికి తీరిక ఎక్కడి దమ్మా?'

'రోషిణీ! పనివాళ్ళు ప్రొద్దెక్కేవరకూ పనిలోకి రావటం లేదటగా? ఆయన వాళ్ళను గురించి అజమాయిషీ తీసుకోటం లేదా?'

'ఇంతకుముందు అన్నీ నువ్వు అజకనుక్కొని వాళ్ళను మందలిస్తూ ఉండేదానివి. ఇప్పుడు అంత సమర్థత ఎవరికి ఉందమ్మా?'

'రోషిణీ! ఆ శబ్దం ఏమిటో విను. వారిబండి వస్తుందనుకుంటాను' అని అడిగింది నీరజ.

'అవునమ్మా' అది బాబుగారిబండే' అంది దాది.

'అయ్యో, నామతి మండిపోను! ఏడ్పు ముఖంతో వారికి కన్పిస్తే ఏమనుకుంటారు! రోషినీ, త్వరగా అద్దం ఇలా తీసుకురా. పూలకూజాలోనుంచి రెండు గులాబిపూలు తెచ్చివ్వు. నా పిన్నులుకూడా తెచ్చిచ్చి నువ్వెళ్ళు, వారు ఇక్కడికి రావచ్చు' అని నీరజ లేచి దుస్తులు మార్చుకో సాగింది.

నీరజ అడిగినవేవో ఇచ్చి రోషినీ అక్కడినుంచి వెళ్ళి పోతూ బల్లవైపు చూసింది. పళ్ళరసమూ, పాలూ దాని మీద అలాగే ఉండిపోయాయి

'అమ్మా! అవన్నీ అలాగే ఉండిపోయాయి. పాలు త్రాగలేదేం?' అని అంది దాది.

'ఇప్పుడు నాకేమీ వద్దు. నువ్వు వెళ్ళు' అంది నీరజ. 'ఇవాళ మందుకూడా రెండుమోతాదులు వేసుకోలేదు. ఇలాఅయితే జబ్బు ఎలా నయమవుతుందమ్మా?' అని అడిగింది రోషినీ.

'నన్ను అదేపనిగా విసిగించకు. కిటికీ తెరచి నువ్వెళ్ళి నీపనేమిటో చూసుకో' అంది నీరజ

కిటికీతలుపులు తెరిచి రోషినీ వెళ్ళిపోయింది.

ప్రొద్దు వాలిపోతుంది; మూడు గంటలయింది. పని వాళ్ళు తోటలో పనిచేస్తున్నారు. ప్రొద్దు వాలిపోయినకొద్దీ పూలమొక్కలు నిలువెల్లా వికసించిన పుష్పాలతో నిండి పోతాయి. తూర్పునుంచి వీస్తున్నగాలికి కొలనులోని నీటి మీద చిరుతరంగాలు లేస్తున్నాయి. నీరజ కిటికీలోనుంచి ఈ దృశ్యాన్ని చూడసాగింది. ఆమెమనస్సుకు ఈ దృశ్యం

ఎంతో హాయి అనిపించింది. ఇదేసమయాన ఆదిత్యుడు గబ గబ గదిలోనికి ప్రవేశించాడు. అతనిచేతిలో అందమైన పుష్పగుచ్ఛం ఉంది. దానిని అతడు నీరజ పాదాలముందుంచి ప్రేమతో ఆమెచేతుల్ని పట్టుకున్నాడు - 'నీరూ, ఇవాళ నిన్ను కలుసుకోలేక పోయాను. చాలా ఆలస్యమయింది. నిన్ను చూడకుండా నాకేమీ తోచదు, చాలా దిగులుగా ఉంటుంది నీరూ!' అన్నాడు ఆదిత్యుడు.

భర్తయొక్క ప్రేమవచనాలు విని నీరజ హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. వెంటనే ఆమె భర్తమెడను కౌగలించుకొని అతని గుండెలపై తల ఆనించి వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఆదిత్యుడు ఆమెను తన హృదయానికి హత్తుకొని, ముంగురులు సవరిస్తూ, కన్నీటితో తడిసిన ఆమెచెక్కిళ్ళను ముద్దు పెట్టుకున్నాడు.

'నీరూ! నువ్వు లేకపోయేసరికి నేను చాలా బాధల్లో చిక్కుకున్నాను' అన్నాడు ఆదిత్యుడు.

'నాకు మాత్రం తెలియదనుకున్నారా? అయినా మీరు ఇప్పుడు పూర్వంవలె నాతో ఏమీ చెప్పటంలేదు. అప్పుడు నేనంటే మీకు ఎంతో నమ్మకం ఉండేది, ఇప్పుడూ ఉన్నదా?' అని అంది నీరజ.

'నీరూ, అవేంమాటలు; నువ్వునా వెనుకటి నీరజవు కావా? పూర్వంకంటెకూడా ఇప్పుడే నీయందు నాకెక్కువ శ్రద్ధవుంది. నీ తెలివితేటల్ని గురించి నాకున్న నమ్మకం లేశమైనా తగ్గలేదు. అనవసరంగా నిన్ను నువ్వు కించపర్చుకొని బాధపడ

తావెందుకు నీరూ? నామీదఒట్టు, ఏడ్వకు' అని ఆదిత్యుడు నీరజను ఓదార్చసాగాడు.

'నేను పనికిరాని పండునైపోయాను స్వామి! మీరు నన్ను త్యజిస్తారేమోనని భయంగా ఉంది' అన్నది నీరజ.

'నీరూ! నువ్వు కటువుగా మాట్లాడితే నాకు చాలా బాధ కలుగుతుంది జీవితంలో నీతో కలిసి ఉంటూ ఎన్నో మధురానుభూతులు, అనుభవాలూపొందానే! నేను నీవాడిని! నీవాడిగానే ఉంటాను అనిమాత్రం గుర్తుంచుకో!'

'మీరు మర్చిపోకుండా ఉంటే నాకు అదే చాలు!'

'నేను ఎలా మర్చిపోగలను నీరూ?'

'భగవంతుడు మీకు మర్చిపోటానికి కావలసినంత అవకాశం ఇచ్చాడు. నే నిక్కడ రోగంతో మంచంలోపడి ఉన్నాను. నన్ను గురించి క్షణకాలమైనా వ్యర్థం చేసుకో వలసిన అవసరం ఏముంది మీకు?

'అలా వింతగా మాట్లాడుతున్నావేమిటి నీరూ! నువ్వు అసలు ఆవిధంగా ఎందుకు ఆలోచిస్తున్నావ్? జీవితంలోని మధురక్షణాలను మరచిపోయే వారుంటారా! వేరే విధంగా ఆలోచించవలసిన అవసరంఏముంది ఇప్పుడు? నువ్వుజబ్బుతో మంచం ఎక్కినందుకు లోలోపల ఎంత కుమిలిపోతున్నానో ఆ దేవునికి తెలుసు!'

'అలా అయితే ఒకమాట అడుగుతాను, చెప్పండి. ఉదయం వెళ్ళినప్పుడు మీరు నన్ను మర్చిపోయారుగదూ?'

'భలే! చాలా బాగా ఆలోచించావు నీరూ! నిన్న నేను మర్చిపోయి వెళ్ళానా? నేను చాలా నిస్సహాయస్థితిలో

హడావిడిగా ఇంటినుంచి వెళ్ళిపోయాను. అలా ఎందుకు జరిగిందో గ్రహించలేకపోయావా నీరూ? ఇప్పటివరకు నిన్ను చూడనందుకు ఎంత తల్లడిల్లిపోయానో తెలుసా?'

'మీరుసరిగ్గా పాదాలుమంచంమీదపెట్టి కూర్చోండి' అంది నీరజ.

'ఎందుకు? ఇవాళ చేసిన నేరానికి కాళ్ళకు సంకెళ్ళు వేద్దామనుకుంటున్నావా?' అన్నాడు ఆదిత్యుడు.

'ఈ పాదాలు నావి, ఈ పాదపద్మాల సహాయంతో ఈ జీవితంలోనేగాక ముందు జన్మల్లోకూడా తరిస్తాను. మీ చరణ సన్నిధినే చనిపోవాలని నాకోర్కె; దానిలోనే నాకు శాంతి లభిస్తుంది. ఇదే నా హృదయ పూర్వకమైన కాంక్ష!'

'నువ్వు లేనిపోని అనుమానాలతో బాధపడుతున్నావు ఇలా అప్పుడప్పుడూ సందేహాలు రావటంవల్ల మన ప్రేమ మరింత రాటు తేలుతుంది' అన్నాడు ఆదిత్యుడు.

'మిమ్మల్ని అనుమానించటమా? అవేం మాటలండి! మీవంటి భర్త లభించటంవల్ల నాజన్మ తరించిందని అనుకుంటూ ఉంటాను.'

'నామీద నీకు అనుమానం లేకపోతే ఇవాల్టినుంచి నేనే నిన్ను అనుమానిస్తూఉంటాను.'

'మీరేది చేసినా నాకు అంగీకారమే.'

'నీరూ; ఎందుకోగాని ఇవాళ నీకు నామీదసందేహం కలిగింది. నిజం కదూ?'

'మాటిమాటికి దానిని గుర్తుచేసి నన్నింకా బాధ పెడతారెందుకు! నా పొరపాటుకు చాలా చింతిస్తున్నాను.'

'చింత, పశ్చాత్తాపాలు ఎందుకు నీరూ? ఇందులో ఏముంది గనుక? ప్రేమలో ఇటువంటివి జరగటం సహజమే!'

'నిజం చెబితే నమ్ముతారో లేదోగాని నామీద నాకే చాలా కోపం వస్తుంది. ఆ దుష్టఘడియ ఎలాంటిదోగాని మిమ్మల్ని గురించి చెడుగా ఎలా ఆలోచించగలిగానో!'

అదేసమయాన రోషీన్ తలుపు తెరుచుకొని లోనికి వచ్చింది! ఆదిత్యునివైపు చూస్తూ 'చూశారా బాబూ; అమ్మాయి ఉదయంనుంచీ మందుగాని పాలుగాని త్రాగనే లేదు. మాలిష్‌కూడా చేయించుకోలేదు. ఇలాఅయితే రోగం ఎలా తగ్గుతుందో మీరే చెప్పండి' అని అన్నది

రోషినీ మాటలు విని ఆదిత్యుడు 'నీరూ! నీమీద నాకు చాలా కోపం వస్తుంది సుమా!' అన్నాడు.

'ఇవాళ అదే జరిగింది. కానీ, ఇందుకు మీకు కోపం తెచ్చుకోవటం ఉచితంకాదు. కోపం రావచ్చు, కానీ మీకు నిజంగా కోపం వచ్చినప్పుడు దుఃఖితురాలగు ఈ నీరజను మర్చిపోవద్దని వేడుకొంటున్నాను.'

ఆదిత్యుడు సరళను కేకేశాడు. సరళ పేరు వినగానే నీరజ మనస్సు వికలమైపోయింది. అమృతంలో విషబిందువు చిందినట్లనిపించింది. ఇప్పటివరకు ఆమె తన మనస్సును నిగ్రహించుకుంది. కానీ, ఇప్పుడు సరళ పేరు విని ఆమెనిశ్చలంగా ఉండలేకపోయింది. ఇంతలో సరళ అక్కడికి వచ్చింది.

'సరళా! నువ్వు నీరజపట్ల లేశమైనా శ్రద్ధచూపించటం లేదు. నీరజ ఇప్పటివరకు మందుగానీ పాలుగాని త్రాగలేదు. అన్నాడు ఆదిత్యుడు కోపంగా.

నీరజ భర్తమాటలకు అడ్డొస్తూ 'పాపం! అనవసరంగా సరళను కోప్పడతారెందుకు! తప్పు జరిగింది నావల్ల. ఇష్టం లేక నేనే మందు త్రాగలేదు. సరళా, నువ్వెళ్ళమ్మా! మధ్య అనవసరంగా నువ్వు చీవాట్లు తినటం ఎందుకు? వెళ్ళు' అని అన్నది.

'వెళితే ఎలా! మందుకలిపిఇవ్వాలి, పాలుత్రాగవా?' అన్నాడు ఆదిత్యుడు.

'మీరు చాలా అన్యాయం చేస్తున్నారు. క్షణమైనా తీరిక లేకుండా సరళతో పనులు చేయిస్తున్నారు. పగలంతా తోటలోపని, ఆ తరువాత నాకుకూడా సేవ చేయాలని మీ ఉద్దేశ్యమా! ఆమెకూడా మనిషే! ఎన్నిపనులని చేస్తుంది! కొన్నిపనులు దాదికూడా చేస్తుందిగదా! సరళను కాస్సేపు విశ్రాంతి తీసుకోనివ్వండి' అని అంది నీరజ.

'దాదికి ఇటువంటి పనులు చేయటం తెలియదు' అన్నాడు ఆదిత్యుడు.

'ఇదేమంత గొప్పపని తెలియకపోవటానికి? ఇలాంటి పనులు రోషీని చక్కగా చేయగలదు 'అంటూ నీరజ రోషీని అంటూ బిగ్గరగా కేకేసింది.

ఆమె తొందరనుచూచి ఆదిత్యుడు. 'అంత బిగ్గరగా కేకవేస్తావెందుకు! జబ్బుతో ఉండి అలా బిగ్గరగా మాట్లాడటం మంచిదికాదు' అని అన్నాడు.

'నేనువెళ్ళి దాదిని పంపుతాను' అంటూ సరళ మరో మాట లేకుండా అక్కడినుండి వెళ్ళిపోయింది.

నీ ర జ

సరళను నేను అంతఎక్కువగా కష్టపెడుతున్నాను కాబోలు! అలాచేయటం మంచిదికాదేమో. అని ఆదిత్యుడు మనసులో అనుకున్నాడు.

ఇంతలో రోషినీ అక్కడికి వచ్చింది. ఆదిత్యుడు చెప్పిన ప్రకారం ఆమె నీరజకు మందు వగైరాఇచ్చింది. తరువాత ఆదిత్యుడు ఆమెతో 'రోష్నీ సరళనుఒకసారి ఇలా పంపు' అని అంది.

మళ్ళీ సరళను పిలవమని చెప్పటం విని నీరజ విస్మయంతో 'చీటికీమాటికీ అలా సరళను బాధపెడతారెందుకు' అంది ఆదిత్యునితో.

'మరేమీలేదు. నీరూ! తోటపనులు ఎంతవరకు జరిగాయో తెలుసుకుందామని' అన్నాడు ఆదిత్యుడు.

'దానికీ ఒకసమయంలేదా! ఎప్పుడూ తోట పనులేనా! ఎప్పుడూ అదేధ్యానమా! కాస్సేపు విశ్రాంతి తీసుకోండి' అని అంది నీరజ.

'పెద్ద పనేమీకాదు. ఒకవిషయం అడిగి తెలుసుకోవాలి' అన్నాడు ఆదిత్యుడు.

'అయినా, సరళ ఇంకాఅంతగా అనుభవంలేదు. తోట పనుల్ని గురించి ఆమెకు అంతగా ఏమి తెలుస్తాయో మీరే చెప్పండి. తోట విషయాలు బాగాతెలిసినవాడు హరియా ఉన్నాడు గదా! అటువంటి విషయాలేవైనా ఉంటే వాడిని అడగండి.'

'నీరూ నాకు ఇదొకఅలవాటైపోయింది. మరేం చేయనో నువ్వేచెప్పు. నువ్వునేర్పినదేగదా! స్త్రీ హృదయ

పూర్వంకంగా పనిచేస్తే ఆమెను మించేవారుండరని నిరూపించావు పూదోటలను గురించి స్త్రీకి మంచినేర్పు ఉంటుందని ఆచరించి చూపావు పురుషుడు ఆపని గత్యంతరం లేకనే చేస్తున్నాడు. స్త్రీలు చాలా ఆశక్తితో పూలమొక్కలే తమ సర్వస్వమని భావించి ఎంతోఉత్సాహంగా పనిచేస్తారని నాకు నిన్నుచూచిన తరువాత అర్థమయింది అందుకని, ఈపనుల విషయంలో పురుషులమీద అంతగా నమ్మకంలేదు.'

'స్వామీ! విధివ్రాలు ఇలాఉంది. నేను జబ్బుతో మంచంపట్టాను. నేనిప్పుడు మీకే విధంగానూ సహాయపడ లేనుగదా! మీకు సహాయపడు వారుకూడా మరెవ్వరూ లేరామె! నేను ఆరోగ్యంగా ఉంటే ఈపనులన్నీ నేనుచూసుకునేదానిని' అని నీరజబాధగా నిట్టూర్చింది. భర్తనిస్సహాయ స్థితికి ఆమెహృదయం ఎంత తల్లడిల్లినా,.. చేయగలిగింది మాత్రం ఏముంది?

ఆదేసమయంలో సరళ అక్కడికి వచ్చింది. ఆమెను చూచి ఆదిత్యుడు 'సరళా, లతామండపము పని పూర్త యిందా?' అని అడిగాడు.

'అయినదండీ!'

'ఇంకేమీ మిగల్లేదుగా?'

'అంతా పూర్తయింది.'

'గులాబి మొక్కల విషయం ఎంతవరకు వచ్చింది?'

'అంట్లు సిద్ధంగా ఉన్నాయి. హరియా నేల బాగు చేస్తున్నాడు.

'వాడికి అప్పగిస్తే పని పూర్తవుతుందా? వాడివల్ల ఎంతవరకు పని జరుగుతుందో నాకు తెలియని విషయంకాదు.'

నీరజ వారిమాటలకు అడ్డొస్తూ సరళతో 'సరళా' పళ్ళ రసం తెచ్చివ్వు. దానితో కొద్దిగా తేనె, అల్లపురసం కూడా కలిపి తీసుకురా' అని చెప్పింది.

ఆమాటవిని సరళ వెంటనే వెళ్ళిపోయింది. తరువాత నీరజ సంభాషణను మారుస్తూ 'మనం రోజూ లేచేవేళకే ఇవాళ మీరు నిద్రలేచారా!' అని అడిగింది భర్తను.

'ఆవేళకే లేచాను.'

'గడియారం అలారంకొట్టిందా!'

'అవును.'

'మీరు రోజూ ఆబల్లమీదనే టీ త్రాగుతున్నారా? నౌకరు సమయానికి టీ తెచ్చిఇస్తున్నాడా?'

'వేళకు తెచ్చిఇవ్వకపోతే నీతో చెప్పకుండాఉంటానా!'

'బల్లకు రెండు వైపులా రెండుకుర్చీలు వేస్తున్నాడు గదూ!'

'ఆవిషయం ఎప్పుడో చెప్పాంగదా! అలాగేచేస్తు న్నాడు. టీ, ఫలహారాలు ఎప్పటివలెనే సర్దుతున్నాడు.'

'నేను కూర్చునే కుర్చీ ఖాళీగానే ఉంటుంది గదూ!'

'ఉంటుంది! ఏంచేయను మరి?'

'సరళను కూర్చోమని చెప్పలేక పోయారా!'

'ఆసమయంలో ఆమె పూజలోమునిగి ఉంటుంది. మనకు అటువంటివేమీ లేవుగా!'

ఆదిత్యుడు ఆవిధంగా జవాబు చెప్పేసరికి అనుమాన పీడితయగు నీరజ హృదయాందోళన తగ్గింది. ఆమె హృదయం ఆనందంతో నిండిపోయింది; సంతోషంతో ముఖం విప్పారింది.

'నీస్థానంలో సరళ ఎట్లా కూర్చుంటుంది' అని ఆదిత్యుడు జవాబు చెప్పాలని నీరజ కోర్కె. కాని ఆమె హృదయంలోని భావం ఏమిటో,ఆమె అడిగినదానిలోగల రహస్యం ఏమిటో అతనికి ఎలా తెలుస్తుంది!అందుకని ఉన్నవిషయాన్ని సూటిగా చెప్పాడు.

'లతా మండపానికి వెళ్ళారా! అని అడిగింది నీరజ.'

'లేదు. అక్కడ కొద్దిగా పనికూడా ఉంది. అదిచేయించమని చెప్పి త్వరత్వరగా బజారుకు వెళ్ళిపోయాను.'

'సరే! మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను,జవాబు చెప్పండి. సరళను రమేసునికిచ్చి వివాహంచేస్తే బాగుంటుందంటారా?'

'చాలా బాగుంటుంది.'

'మరి, ఎందుకు చేయించరు?'

'నేను పెళ్ళిళ్ళుచేయించే కంట్రాక్టరును కాదుగదా!'

'అది కాదండీ! మీరు కంట్రాక్టరని నేను అనటం లేదు. వాళ్ళిద్దరికీ పెళ్ళిచేస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యం. సరళకు పెళ్ళి చేయవలసింది మనమే గదా? రమేసుడుచాలా మంచివాడు; అలాంటివాడు లభించటం సరళ అదృష్టమే!'

'ఈడూ జోడూ బాగానే ఉంటుంది. కాని, వాళ్ళ అభిప్రాయాలు ఏమిటో తెలుసుకునే అవకాశం నాకింతవరకు

కలుగలేదు. వాళ్ళు ఒకరినొకరు ప్రేమించుకుంటున్నారని కూడా నే నెప్పుడూ చూడలేదు.'

'మీకా దిగులేమీవద్దు. ఒకరంటే ఒకరికి ఇష్టమే. ఒకరి కొకరు నచ్చారు.'

'అలా అయితే, నువ్వే ప్రయత్నించకూడదూ?'

'మీరు ఆమెకుఇరవైనాలుగ్గంటలూ ఊపిరిఆడకుండా పనులు పురమాయిస్తున్నారు. పాపం! ఆమెకు విశ్రాంతే ఉండదు! ఇక ప్రేమించటానికికూడా ఆమెకు తీరిక ఎక్కడిది! తన పెళ్ళి విషయం ఆలోచించుకోటానికికూడా ఆమెకు తీరిక లేకుండా చేశారు.'

అంత ఆలోచించుకోవాలనేఉంటే తీరికేలేదంటావా!

'ఎందుకండీ ఈ అనవసరపుమాటలన్నీ! అసలు సరళకు వివాహం చేయటం మీకు ఇష్టంలేదు. వివాహం జరగ్గానే సరళ వెళ్ళిపోతే మీ పనులు చేయటానికి ఎవరూ ఉండరని మీ దిగులు.'

'నీమాటకూడా కాదనటానికి వీల్లేదు.'

'ఆమాటవినగానే నీరజ మనస్సు చురుక్కుమంది. ఆమెహృదయంలో తుఫాను రేగింది. హృదయంలోకల్లోలాన్ని సంభాళించుకో లేకపోయింది. దానికి తగినట్లే ముఖంలో రంగులు మారసాగాయి. అకస్మాత్తుగా నీరజ బాధపడుతూ ఉండటం గమనించి ఆదిత్యుడు 'అలా మారిపోయావేమిటి నీరూ!' అని అడిగాడు.

'ఏమీలేదు! గాబరా పడాల్సిన పనిలేదు' అందినీరజ,

ఆదిత్యుడు వెళ్లాలని లేచి నిలబడ్డాడు. అప్పుడు నీరజ అతనితో 'మన వివాహం జరిగిన వెంటనే ఇద్దరం కలిసి ఆ లతామండపాన్ని నిర్మించాము. మనం ఇద్దరమూ రోజూ అక్కడికి వెళుతూ, ఆలతను మనమే స్వయంగా పెంచాము. ఇవాళ మీరే దానిని పాడు చేస్తున్నారు. దానిమీద మీకు లేశమైనా ప్రేమలేదు' అని అన్నది.

ఇలాంటి నిందవస్తుందని తెలియకపోవటంవల్ల ఆమాట వినగానే ఆదిత్యుడు నిశ్చేష్టుడై అలాగే నిల్చుండిపోయాడు.

నువ్వంటున్న దేమిటి నీరూ! నే నే దానిని పాడు చేస్తున్నానా! ఎవరుచెప్పారుఅలాఅని?' అన్నాడుఆదిత్యుడు.

"ఏమీ తెలియని సరళకు ఆలతామండపంపని ఎందుకు అప్పగించారు?" అనిఅడిగింది నీరజ కోపంగా.

"సరళకు ఏమీ తెలియదని నీ ఉద్దేశ్యమా! పూల మొక్కల్నిగురించి నాకుపాఠాలునేర్పిందెవరు,సరళ పెదనాన్న; వారివద్దచిన్నతనంనుంచీ ఈవిషయాలుచక్కగా నేర్చుకొంది. పూదోట విషయాలు నాకంటె ఆమెకే ఎక్కువగా తెలుసు" అని చెప్పాడుఅతడు.

"అంటే మీరిద్దరూ పాత స్నేహితులే నన్నమాట!"

"అప్పుడు నేను కాలేజీలో చదువుతున్నాను. సరళ ఇంట్లోనే పెదనాన్న వద్ద చదువుకొంటూ ఉండేది; తోట పని కూడా నేర్చుకుంటూ ఉండేది! నాకు మాత్రం అంతగా తీరిక ఉండేది కాదు!"

నీరజ ముఖం అదో మాదిరిగా మారిపోయింది. కాని ఆమె సంభాషణ ఇంకా సాగిస్తూ ఇలా అంది—

'అందుకనే ఆయన పూరూ పేరూ లేకుండాపోయాడు. సరళలో అలాంటి లక్షణాలు ఉన్నాయి! ఒక్కొక్క పాదం పెట్టిన వేళావిశేషం అది! సరళ నడకలో మొగ లక్షణాలు గోచరిస్తాయి. స్త్రీలలో పురుషలక్షణాలు ఉండకూడదంటారు.'

ఆదిత్యుడు తృళ్ళిపడ్డాడు.

'ఇవాళ ఏవేవో పిచ్చిమాటలన్నీ వాగేస్తున్నావు, ఏమయింది నీకు? సరళ పెదనాన్న పూలమొక్కలవిషయంలో ఎంత అనుభవశాలో నీకేం తెలుసు? అంతబాగా తెలిసిన వారిని నే నింతవరకు ఎక్కడా చూడలేదు మంచిపేరు ప్రతిష్టలు సంపాదించుకున్నాడే, కాని డబ్బే సంపాదించ లేక పోయాడు. అందుకు చాలా కారణాలుఉన్నాయి. మొట్ట మొదట ఆయనే మనపూదోటకు కావలసిన డబ్బు పెట్టుబడి పెట్టాడని మర్చిపోయావా? అప్పుడువారి పరిస్థితే బాగుండ లేదు' అయినా మనకు సహాయంచేశారు చాలావిశాల హృదయులు. భగవదనుగ్రహంవల్ల త్వరలో నేవారి ఋణాన్ని తీర్చివేయగలిగాను' అన్నాడు ఆదిత్యుడు.

ఇంతలో సరళ పళ్ళరసం తెచ్చి బల్లమీద ఉంచింది. సరళ అటువెళ్ళగానే నీరజ భర్తతో' మరి మీరు సరళనే వివాహమాడలేక పోయారా?' అని అడిగింది.

'ఆ రోజుల్లో వివాహం చేసుకోవాలనే అభిప్రాయమే లేదునాకు. అసలు అలాంటి ఆలోచనే ఎప్పుడూ రాలేదు.'

'అదే మీజీవితసారమా?'

'నాజీవితసారం నువ్వు. నిన్ను చూసినప్పుడే మొట్ట మొదట నాకు వివాహంచేసుకోవాలనేకోర్కె కలిగింది. నిన్ను

చూచి ఉండకపోతే ఇప్పటివరకు బ్రహ్మచారిగానే ఉండేవాడి నేమో! మరి నీవద్ద అలాంటి ఆకర్షణ ఏం ఉందో ఏమో!' అన్నాడు ఆదిత్యుడు.

'చూడటానికి సరళ అనాకారిగా ఉండదని నా అభిప్రాయం' అంది నీరజ.

'సరళ అందంగా ఉంటుందా లేక మరెలా ఉంటుంది అని నే నెప్పుడూ పరిశీలించి చూడలేదు.'

'ఆమెమీద మీకెప్పుడూ ప్రేమ కలుగలేదేమో నిజం చెప్పండి' అని అడిగింది నీరజ.

'ఎందుకు కలుగదు! నేనూ మనిషినే గదా! ఒక మనిషికి వేరొక మనిషిమీద ప్రేమ కలగటం సహజమే! మామయ్య పెద్దకుమారుడు రంగూనులో ప్లీడరుగా ఉంటు న్నాడు. అతని విషయంలో మామయ్యకు ఏమీ విచారమే లేదు. తన పూదోట ఎప్పుడూ ఫలపుష్పాలతో కళకళ లాడుతూ నిండుగా ఉండాలనీ, అలాగే సరళ ముఖంలో ఎప్పుడూ సంతోషం నిండిఉండాలనీ వారి కోర్కె. తన తరు వాత సరళ తోట బాధ్యత వహించాలనే వారి అభిప్రాయం. కాని, వారి ఆశ నెరవేరలేదు. వారి తదనంతరం సరళ తోట పనులు చూచుకుంటూ సంతోషంగానే గడిపింది. ఇంతలో జడ్జీగారు తోటను వేలంవేయించారు. దానితో సరళమనస్సు వికలమైపోయింది. ఆమె ఇక్కడ ఉంటున్నప్పటికీ ఎంత విచారంగా ఉంటుందో గమనించలేదా? లోలోపల ఎంతో కుమిలి పోతూ ఉంటుంది. ఇతర ఆలోచనలు మనస్సుకు చీకాకు

పర్చకుండా ఉండాలనే ఉద్దేశ్యంతో ఎప్పుడూ ఆమె ఏదో ఒక పని చేస్తూ ఉంటుంది.'

నీరజ భర్తమాటలకు అడ్డొస్తూ ఇలా అంది – 'సరళ చాలా తెలివిగలదని మీరు అనేకసార్లు చెప్పారు. అయితే నాకు ఇప్పుడు అవేమీ తెలుసుకోవాలనిలేదు. మీరు నా మాట విని ఆమెను 'బర్సాత్ గరల్స్ కాలేజిలో' చేరమని చెప్పండి. ఆమెకోసం వాళ్లు చాలాసార్లు కబురుపంపారు.'

'అంతకంటె దూరప్రదేశమేదీ కన్పించలేదా నీకు?'

'అయితే నేను చెప్పేదికూడా వినండి. ఆమెకు మీరు మీఇష్టం వచ్చినపని చెప్పండి, నాకు అనవసరం. లతామండపానికి సంబంధించిన పనులు ఆమెతో చేయిస్తే మాత్రం నేను సహించలేను.'

'దానిలో ఉన్నప్రత్యేకతఏమిటి? నీఉద్దేశ్యం ఏమిటో నాకేమీ అర్థమవటంలేదు.'

మీకు అర్థంకాదు గనుకనే నేనుచెప్పేది. లతామండపాన్ని గురించి సరళకు ఏమీ అనుభవంలేదని నానమ్మకం.'

'ఏం మాటలవి అర్థంలేకుండా. మామయ్యకు లతామండపాలంటే చాలాఇష్టం. అందుకోసం ఆయన చైనా, జావా మొదలగు దేశాలనుండి రకరకాల లతలు తెప్పిస్తూ ఉండేవాడు. సరళకు లతల్నిగురించి నాకంటె ఎక్కువ అనుభవం ఉంది-' అన్నాడు ఆదిత్యుడు.

ఆవిషయం నీరజకు మాత్రం తెలియదూ? తెలుసు. కాని, లతామండపం బాధ్యత సరళకు అప్పగించటం నీరజకు ఎంతమాత్ర ఇష్టంలేదు. లతామండపం మీద తనకున్న

అధికారాన్ని ఆమె వదులుకోదలచలేదు. ఆ అధికారం తనకే ఉండాలి. దాని మంచిచెడులన్నీ తానే చూడాలి. అని ఆమె ఉద్దేశ్యం.

తన మనసులోఉన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తూ నీరజ భర్తతో ఇలా స్పష్టంగా చెప్పింది – 'మీరు చెప్పినది నిజమే కావచ్చు. అయినప్పటికీ లతామండపం విషయంలో సరళ జోక్యం చేసుకోటానికి వీల్లేదు. ఇంత గట్టిగా ఎందుకు చెబుతున్నానో ఆలోచించారా? అది మన దాంపత్య జీవితంలోని అనేక మధురస్మృతులకు చిహ్నం. సరళ నీడకూడా దానిమీద పడటానికి వీల్లేదు. ఇదే నాకోర్కె. ఇది మన ఇద్దరికీ సంబంధించినది, చిరకాలం మనదిగానే ఉండాలి. మీరు అంతగా ఆమెతో పని చేయించదలిస్తే తోట పని యావత్తూ ఆమెకే అప్పగించండి; లతామండపంపనిమాత్రం ఆమెతో చేయించవద్దు నాస్మృతి చిహ్నంగా ఉన్నది అదొక్కటే కదా! నేను తిరిగే స్థితిలోలేను. లేకపోతే... ...'

దుఃఖభారంతో నీరజ తరువాతమాట్లాడలేకపోయింది. ఆమె దిండులో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నీరజ ఏడ్పుచూచి ఆదిత్యుని హృదయం కరిగిపోయింది అతడు అమితంగా బాధపడసాగాడు.

ఆశ్చర్యచకితుడై ఆదిత్యుడు ఒకసారి నీరజ వంక చూశాడు. తమదాంపత్య జీవితంలోని ఒక్కొక్క ఘటన అతని మనస్సులో మెదలసాగాయి. అతనికి తనమీద తనకే చాలా కోపం వచ్చింది.

ఆదిత్యుడు తనలో తాను ఇలా ఆలోచించుకో సాగాడు— పది సంవత్సరాల కాలం నీరజతో దాంపత్య జీవితం గడిపిన తరువాతకూడా నేనామె అభిప్రాయాలను తెలుసుకోలేక పోయాను. నేను మూర్ఖుణ్ణి! పూల మొక్కల్ని పెంచటంలో సరళకు చాలా అనుభవమూ, నేర్పుఉన్నాయి. గనుక ఆమె సంరక్షణలో మాపూదోట నిత్య నూత్నంగా విలసిల్లుతూ ఉంటే చూచి నీరజ సంతోషిస్తుందని అనుకున్నాను. సరళ అంటే నీరజకు ఇష్టం లేదు. ఆమె ఇక్కడ ఉండటం కూడా నీరజకు నచ్చినట్లు లేదు. సరళ ఇంత కృషి చేసినప్పటికీ, నీరజ ఆమెకృషిని అభినందించదు సరికదా లోలోపల ద్వేషిస్తున్నట్లు కన్పిస్తుంది. నే నెప్పుడైనా సరళ పనుల్ని మెచ్చుకుంటే నీరజ ఆమెను నిందిస్తూ ఉంటుంది. నాకు తెలియని ఒకపనిని సరళ నిన్న చాలా నేర్పుతో చేసిందని నేను నీరజతో చెప్పినప్పుడు అందుకామె ఇతరులనుఅతిగా ప్రశంశించటం మీకు అలవాటయి నట్లుంది! అదేమంత ఘన కార్యం! అని తేల్చేసింది. నీరజ అలా అనడానికి సరళ పట్ల ఆమెకున్న ద్వేషభావమే కారణం.

ఈవిధమైన ఆలోచనలతో ఆదిత్యుని మనస్సు గిర్రున తిరగ సాగింది. గతంలో జరిగిన అనేక ఘటనలు గుర్తుకు రాసాగాయి. సరళ వల్ల చిన్న లోపం జరిగితేచాలు. నీరజ దానిని కొండంత చేసి కొద్దిరోజులవరకు విమర్శిస్తూ ఉండేది. అవకాశం ఉన్నన్ని విధాల సరళను విమర్శించి సంతృప్తి పడుతూ ఉండేది. ఎక్కడెక్కడి ప్రశ్నలు అడిగి' నీకుపూలను గురించి ఏమీ తెలియదు! ఈమాత్రం స్వల్పవిషయం తెలి

యని వారెవరూ ఉండరు. హరి యూరు తెలిసిన పాటి కూడా నీకు తెలియదు' అని నిందించేది.

ఆదిత్యుడు ఈ పాతసంగతులన్నీ గుర్తు చేసుకొని కుమిలి పోసాగాడు. కాని, వెంటనే నిగ్రహించుకొని; ఈ వర్చను ఇంతటితో నిలిపివేయాలనే నిశ్చయంతో నీరజ తలమీద చెయ్యి వేసి ఓదారుస్తూ ఆదిత్యుడు ఇలా అన్నాడు—

'నీరూ! నీకు బాధకలిగించాలని నాఉద్దేశ్యం కాదు. నువ్వు సదా సంతోషంగా ఉండాలనే నేను కోరుకునేది'నువ్వు చెప్పిన ప్రకారమే నేను చేస్తాను. సరళను తోటపనులకు పంప వద్దంటావా? నీకు ఇష్టం లేకపోతే పంపను. ఇకనువ్వు ఏవిష యంలోనూ దిగులు పడవద్దు.'

నీరజ భర్తచేతిని పట్టుకొని 'మీరు నన్ను ఓదార్చ వలసిన అవసరం లేదు. అయినా; నాఅభిప్రాయాలను, నాఇష్టా లనుగురించి మీరెందుకు ఆలోచించాలి? మీరు యజమా నులు! మీఅధికారాన్ని కాదనటానికి నేనెవర్ని?' అని అంది.

నీరూ! ఏమిటీమాటలు! నీకేమైనా పిచ్చి పట్టిందా ? మనిద్దరిమధ్య ఈ విభేదాలేమిటి? నాకేమీ అర్థం కావటం లేదు. మనిద్దరిమధ్య నీనాఅనేభేదాలు రాకునచ్చువు.అయినా, ఈతోటనాది అనిగానీ, నాయిష్టంఅనిగానీ నేనెప్పుడైనా నీతో అన్నానా! నువ్వు పరాయిదాని వైనట్లూ, నీకేమీ అధి కారం లేనట్లు మాట్లాడతావేం?'

'ఏం ఉన్నా ఏం ప్రయోజనం? నామంచిమీకులభించే దేముంది గనుక? రోగంతో మంచంఎక్కటంవల్ల మీకు సేవ చేసే అదృష్టానికి కూడా దూరమయ్యాను. ఈ రోగంతప్ప

నాకిక మిగిలిందేముంది? మీకునాపై అనవసరంగా ఆశలెం దుకు? నేను సరళతో పోటీచేయలేను! అదీగాక ఈస్థితిలో నేను మీకేమీ చేయలేను.'

'నీరూ! సరళ వచ్చిననాటినుంచీ నీకుబాధగానేఉంది. సరళ రాక నీకు చాలా అసంతృప్తి కలిగించింది. ఎందుకో నాకేమీ బోధపడటంలేదు. నువ్వు ఆరోగ్యంగా ఉండే రోజుల్లో అనేకసార్లు సరళను ఇక్కడికి ఆహ్వానించి అనేక విష యాలు ఆమెను అడిగి తెలుసుకునే దానివి సరళ సలహా నను సరించి నువ్వు కమలా చెట్లనువేసి పెంచినప్పుడు నేనునిన్నెంత అభినందించానో గుర్తున్నదా?'

'ఇప్పుడవన్నీ ఎందుకు? మర్చిపొండి. సరళలో ఆనాడు ఇప్పుడు ఉన్నంతగర్వం ఎక్కడిది? ఇవాళ సరళ మీకంటికి సర్వగుణ సంపన్నురాలుగా, సమర్థురాలుగా కన్పిస్తూఉంది ఆమెకు మొక్కల విషయంలో నాకంటె ఎక్కువ తెలుసునని మీరు భావిస్తూ, నాఎదుట అదేపనిగా ఆమెను ప్రశంసిస్తు న్నారు. ఆమె అసాధారణమైన ప్రతిభావంతురాలని మీదృఢ విశ్వాసం. ఇంతకు పూర్వం ఎప్పుడూ మీరునన్ను ఆమెతో పోల్చలేదు; నాలాంటి జబ్బుమనిషితో ఆమెను పోల్చి చూసినందువల్ల ప్రయోజనం ఏముంది? నేను ఏవిషయంలో నూ ఆమెతో పోటీచేసినెగ్గలేను నిజం చెప్పాలంటే, సరళ మిమ్మల్ని ఆకర్షించింది. మీహృదయంలో స్థానం సంపాదిం చుకుంది! ఆమె అదృష్టం! తగినయోగ్యత గలది!'

'నా నీరూహృదయం ఇంత విషపూరితంగా ఉంటుం దని నేను కలలోకూడా తలచలేదు. నువ్వేనా ఇలా మాట్లా



డుతున్నది? నీనుంచి ఇలాంటి మాటలు వింటానని నేనెప్పుడూ అనుకోలేదు' అన్నాడు ఆదిత్యుడు.

'అంటే నేను మారిపోయానని మీఉద్దేశ్యమా! ఆ అనుమానమే నా ప్రాణాలను కొరికేస్తుంది. నేను వెనుకటి నీరజనే! నేను మిమ్మల్ని వివాహమాడి ఈ ఇంట్లో అడుగు పెట్టిన నాటినుంచీ నన్ను నేను మరచిపోయాను, లేనట్లయితే ఈ పూలతోటనే ద్వేషించి ఉండేదానను. ఈ పూదోటకు నా సర్వస్వమూ ధారపోసి కన్నబిడ్డవలె దీనిని పెంచాను. నా శక్తిని, నాశ్రమను పూర్తిగా ఈ పూదోటలో సాక్షాత్కరింప చేసుకున్నాను. ఈ పూదోట నేను, నేనే ఈ పూదోటగా జీవించాను. ఈ పూదోట నా ఆత్మ స్వరూపం. మీకీ విషయాలన్నీ తెలిసికూడా ఇవన్నీవిస్మరించారు' అనిఅంది నీరజ ఆవేశంగా.

'నువ్వు అంటున్నదేమిటి నీరూ? నేను నిన్నుమరిచిపోయానా? నేను నిన్నేమరిచిపోతే నాకీ జీవితంలో ఇక గుర్తుంచుకోతగిన వేమున్నాయి?' అన్నాడు ఆదిత్యుడు.

'మీరునన్ను గుర్తుంచుకొని కూడా విస్మరించేలాంటి పని చేశారు, అందుకేఇంత బాధ! ఈపూదోట నాకు ప్రాణసమానమని తెలిసి, నా ప్రాణాలను మీరు మరొకరి చేతుల్లో పెట్టారు? నావస్తువును మరొకస్త్రీకి అప్పగించగలరా! అలా ఎందుకు చేశారు? నా కళ్ళఎదుటనే నా సర్వస్వాన్ని. సునాయాసంగా సరళకు దోచిపెట్టి నన్ను వంచిస్తారని కలలోకూడా అనుకోలేదు' అంది నీరజ.

'పూదోట పనులు సరళకు అప్పగించటం తప్పు అని నీ ఉద్దేశ్యమా? నువ్వు తప్పుఅని భావిస్తే చెప్పు' అని అడిగాడు ఆదిత్యుడు.

'తప్పుకాదు. నా ప్రాణాలనే దోచి ఇచ్చారు.'

'నువ్వు నాస్థానంలో ఉంటేఏమి చేసేదానివి?'

'నే నేమిచేస్తాను అని అడుగుతున్నారా? నేను ఏమి చేసేదానినో మీరు వూహించనైనా లేరు. ఈ పూదోటను గురించి గానీ, ఈ పూలవ్యాపారాన్ని గురించి గానీ ఆలోచించను. ఇదంతా నాశనమై పోయినా ఇష్టపడేదానిని కాని వేరొక స్త్రీకి మాత్రం అప్పగించను తననుమించినవారు లేరని గర్వపడే ఇలాంటి స్త్రీని మీఛాయలకే రానివ్వను. ఇలా ఎన్నటికీ జరగనివ్వను. మీనలె నేను మిమ్మల్ని చిన్నచూపు చూడను. మీరు నన్నెందుకు ఈ విధంగా అవమాన పర చిందీ నాకిప్పుడు బోధపడింది. లేచి తిరిగేశక్తి లేకపోవచ్చునే గాని ఇంకా నాలో ఆలోచించేశక్తి నశించలేదు. నాకు అంతా తెలుసు.'

'నీకు తెలిసిన దేమిటో నేను కూడా వినవచ్చునా?' ఎందుకు వినకూడదు! మీకు సరళ అంటే ప్రేమ ఈనాటి నుంచి కాదు: అది ఎప్పటి నుంచో ఉంది. ఆమెను మీరు ప్రేమిస్తున్నారు. నా నిస్సహాయ స్థితి నుంచి మీరు లాభం పొందాలనుకుంటున్నారు. నా నిస్సహాయస్థితిని ఆధారం చేసుకొని ఆమె పట్ల మీ హృదయంలో దాగి ఉన్న ప్రేమను సిద్ధింప చేసుకోటానికి వీలు కల్పించుకుంటున్నారు.'

ఆదిత్యుడు తల పట్టుకొని ఆలోచించ సాగాడు. తన హృదయంలో చెలరేగిన సంఘర్షణను అణచుకోవాలని అతడు ప్రయత్నించ సాగాడు. చివరికేలాగో భిన్నాభిన్నమైపోయిన మనస్సును చిక్కబట్టుకొని నీరజతో ఇలా అన్నాడు.

'నీరజా! ఇందుకు నేను నిన్ను నిందించటంలేదు; తప్పంతా నాది! పదిసంవత్సరాలు నీతో కలిసి జీవితంగడిపి కూడా నేను నిన్ను నాదానినిగా చేసుకోలేకపోయాను. ఇంత కాలం నాతో ఉంటూ నువ్వు నన్ను అర్థం చేసుకోలేదంటే, ఆదోషమూ నాదే! దీనిని గురించి ఇక నీతో వాదించినందు వల్లకూడా ప్రయోజనం ఉండదు. నాబలహీనతకు ఇవాళ్టి నుంచే నేను ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. నేనిక ఈఇంటిలో ఉండను; పూదోట ప్రక్కన ఉన్నపాకలో ఒంటరిగా ఉంటాను. నువ్వూ, నేను, సరళ, ముగ్గురం దూరదూరంగా ఉంటూ ఉంటే అప్పుడైనా నీ అభిప్రాయం మారుతుందని ఆశిస్తాను. నేను విశ్వాసఘాతకుణ్ని కాదనిమాత్రం గుర్తుంచుకో! అది నువ్వు అర్థం చేసుకోవాలనే నాఆశ!'

# 5

గుబురుగా పెరిగిన జామచెట్లు చాలా అందంగా ఉన్నాయి. ఆచెట్లచాటునుంచి చంద్రుడు పైకి వస్తున్నాడు. చెట్లమధ్యఉన్న కొలనులోని నీటిపై వెలుగునీడలు దోబూచు లాడుతున్నాయి. క్రమంగా చంద్రుడు ఆకాశం మధ్యకు ఎక్కివచ్చి చల్లని వెన్నెల కురిపించసాగాడు. వెన్నెలలో తోటలోని పుష్పాలు మరింత అందంగా కనిపిస్తున్నాయి.

శీతాకాలపు ప్రారంభదినాలు; కొద్దిగా మంచుపడుతూఉంది కొలను నీటిమీద మంచుతెర కప్పింది. గాలిలేదు, కీచురాళ్ళ ధ్వనిమాత్రం వినవస్తుంది. అలాంటి అపూర్వ నిశ్శబ్దనిశీధిలో సరళ కొలనుగట్టున కూర్చొని ఆలోచనాసముద్రంలో మునిగి ఉంది. ఆమె ముఖభావం చాలా గంభీరంగా కన్పిస్తుంది.

ఇంతలో చప్పుడు కాకుండా మెల్లగా అడుగులువేస్తూ రమేశుడు అక్కడికి వచ్చాడు.

'నేను నీతో మాట్లాడాలి' అన్నాడు రమేశుడు.

'అలాగే మాట్లాడండి' అంది సరళ. ఆమె కంఠం గద్గదమైనట్లు గోచరించింది.

రమేశుడు క్రిందిమెట్టుమీదికివచ్చి సరళపాదాలచెంత కూర్చున్నాడు. సరళఆశ్చర్యంతో కాళ్ళు వెనక్కిలాక్కుంది.

'ఇలావచ్చి ఇక్కడ కూర్చోండి' అని సరళ తన ప్రక్కస్థానం, చూపింది. ఆమె కంఠధ్వనిలో స్నేహభావం కన్పించింది – 'పాదాలవద్ద కూర్చొనటం మంచిదికాదు! మీరలాచేసి నన్ను సిగ్గుపరుస్తున్నారు' అని అంది.

'దేవీపాదాలచెంతనే దాసునికి గౌరవం కలుగుతుంది. నీప్రక్కన కూర్చునే సమయం వచ్చినప్పుడు చూద్దాం. నీ చేతినిలా ఇవ్వు. పాశ్చాత్యులవలె నేను ప్రేమను ప్రదర్శించ గలనో లేదో చూస్తాను' అన్నాడు అతడు నవ్వుతూ.

సరళ నిస్సంకోచంగా తనచేతిని అందించింది. రమేశుడు ఆమె చేతిని పట్టుకొని ప్రేమసూచకంగా దానిని ముద్దు పెట్టుకున్నాడు.

'దేవీ అందాలరాశీ! అభివందనాలు! నా అభివంద నాలు అనుకుంటావని ఆశిస్తున్నాను' అన్నాడు రమేశ్.

అంతలోనే అతడు జేబులోనుంచి ఒకపొట్లం తీసి, దానిలోని పొడిని సరళ తలమీద పోశాడు. ఆశ్చర్యపడుతూ సరళ' ఇదేమిటి?' అని అంది.

'ఆమాత్రం తెలియకపోతే ఎలా? ఇవాళ హోలీపండుగ అని కూడా గుర్తులేదా? పూదోటలోని ప్రతిరెమ్మలోనూ ఎంతో అందం తొంగిచూస్తూఉంది. ఎటుచూచినా అందం, ఆనందం వెల్లివిరిసే ఈ ఋతువులో విచారంగా కూర్చున్నా వెందుకు? మనస్సులోని విచారాన్ని పారద్రోలి జీవితానికి క్రొత్తరంగుల్ని సమకూర్చుకో. నువ్వు ఎందుకు బాధపడు తున్నదీ నాకు తెలుసు. అందుకే నే నిప్పుడు ఇక్కడికి వచ్చాను' అన్నాడు రమేశ్.

'అబ్బో, చాలా మాటకారివి. నీతో సమానంగా ఎవ్వరూ మాటలు చెప్పలేరు. మాటలుచెప్పటం నీవద్దనేర్చు కోవాలి. నీతో నేనెక్కడ గెలువగలుగుతాను! ఓటమిని అంగీకరిస్తున్నాను' అని అంది సరళ.

'నేను చెప్పేవి వట్టిమాటలుకావు. కఠోర సత్యాన్ని చెప్తున్నాను. పురుషుడు ఎలాగో మా ట కా రే! ఒక అబ్బాయి ఒక అమ్మాయి ముందు తనప్రేమను వ్యక్తం చేసినప్పుడు, ఆ అమ్మాయి ఏమీమాట్లాడకుండా మౌనం వహించటం అంటే ఆమె అంగీకరించినట్లే అతడు భావిస్తాడు! కొంచెం అవతలికి జరుగు, నన్నుకూడా నీప్రక్కన కూర్చోండ నివ్వు' అన్నాడు అతడు.

సరళ అవతలికి జరిగింది. రమేశుడు ఆమె ప్రక్కన కూర్చున్నాడు. కాస్సేపటివరకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

చివరికి సరళ సంభాషణ ప్రారంభిస్తూ 'రమేశ్! జైలుకు వెళ్ళే ఉపాయం చెప్పగలవా?' అని అడిగింది.

చాలా మంచి ప్రశ్న అడిగావు. జైలుకు వెళ్ళటానికి అనేక పద్ధతులు, అనేకమార్గాలు ఉన్నాయి; ఒకదానిని మించినది వేరొకటి! చాలా సులభం జైలుకు వెళ్ళకుండా తప్పించుకు తిరగటం ఎలాగో అడిగితే జవాబు చెప్పేవాడిని. ఆగ్లేయులు మన భారతీయుల కోసమని జైళ్ళను దేవాలయాలుగా రూపొందించారు. మనకోసం వాటి తలుపులు సదా తెరిచే ఉంచుతారు.'

'చూడు! నేను పరిహాసంగా అడగటంలేదు. నా మనస్సును వేధిస్తున్న బాధలనుంచి విముక్తిచెందాలంటే నాకు జైలుకు వెళ్ళటమే మార్గమని తోస్తుంది' అంది సరళ.

'నిన్ను వేధిస్తున్న బాధఏమిటో నాతో చెప్పు! నీలో నువ్వు కుమిలిపోతూ ఇలా విచారంగా కూర్చోవద్దు.'

'ఏమని చెప్పమంటావ్? నా హృదయావేదన ఎవరితో చెప్పుకునేది? మీ అన్నగారిని చూశావా రమేశ్! చూసిఉంటే నన్ను ఇట్లా అడిగే వాడవుకాదు.'

'ఏదో జరిగి ఉంటుందని అనుమానం కలిగింది. అయితే, ఇంతకూ ఏం జరిగిందో చెప్పు' అని అడిగాడు రమేశ్.

'ఇవాళ సాయంత్రం కుర్చీలో కూర్చొని ఒక ఇంగ్లీషు పత్రిక చదువుతున్నాను. పూలమొక్కలను గురించి దానిలో చాలా కొత్తసంగతులు ఉన్నాయి అప్పుడే మీ అన్నగారు అక్కడికివచ్చారు. అంతకుముందు ప్రతిరోజూ సాయంత్రం ఈ సమయానికి వారు నన్ను టీకి పిలుస్తూఉండేవారు. టీ త్రాగుతూ కూర్చొని ఆరోజు చేసిన పనుల్నిగురించి అడిగి, పూదోటకు సంబంధించిన ఇంకా ఇతర సంగతులూ, రేపు చేయవలసిన పనుల్నిగురించీ చర్చించేవారు. మామూలు ప్రకారం వారి పిలుపుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. కాని, వారే స్వయంగా అక్కడికివచ్చారు. హృదయంలో పడుతున్న బాధ వారి ముఖంలో వ్యక్తమవుతూనే ఉంది. వారు పడే ఆందోళన, అశాంతితో లోలోపల కుమిలిపోతూ ఉండటం నేను గ్రహించాను. వసారాలో నిలబడి కాస్సేపు ఏదో ఆలోచించారు. తరువాత పిచ్చివానివలె అటూ ఇటూ తిరిగారు. పూలతోటవైపు చూడనైనా లేదు. పనివాళ్ళు కబుర్లుచెప్పుకుంటూ ఉంటే అదేమనిఅడగలేదు. జీవితంమీద విరక్తిచెందిన మనిషివలె కన్పించారు. చాలాసేపు అలా ఆలోచిస్తూ ఉండి నెమ్మదిగావచ్చి నాప్రక్కనేఉన్నకుర్చీలో కూర్చున్నారు నేను పత్రిక తిరగేస్తూ ఉండటంచూశారు. ఏమి ఆలోచించారో లేచి వెళ్ళిపోయారు. నే నేదో అడిగితే పనిఉంది, ఒకచోటకు వెళ్ళాలి అంటూ వెళ్ళిపోయారు. ఆ సమయాన హృదయంలో వా రెంత బాధపడుతున్నారో మాటలతో వర్ణించి చెప్పలేము'

అందుకు రమేశుడు 'అన్నయ్య నీతో ఏం చెప్పాలని వచ్చి ఉంటాడో వూహించగలవా!' అని అడిగాడు.

'రమేశ్! నేను ఆలోచించినంతవరకు నాకు కన్పిస్తున్నది ఒక్కటే వారి జీవితమార్గంలో నే నొక భయంకర అవరోధంగా తయారయాను మా ఇద్దరికి ఏదో సంబంధం వుందని వాదు వచ్చింది. నామూలాన పవిత్రమైన వారి జీవితానికి తీరని మచ్చవచ్చింది.'

'అయితే; ఇప్పటికి ఉన్న నాబాధలు గాక నాకు మరొకటి వచ్చిపడిందన్నమాట! అంతకంతకూ ఈమనో వేదన హెచ్చుతూ ఉందిసుమా!' అన్నాడు రమేశ్.

'అంటే?'

'నన్ను నేను నిగ్రహించుకోలేని స్థితివచ్చింది. నువ్వు నా జీవితానికి ఒక కంటకంగా తయారవుతావు.'

'నేను జన్మించినది మొదలు కంటకంగానే తయారయాను. వారి మార్గానికి కంటకంగా ఉన్నందువల్లనే ఆ బాధపడలేక తల్లిదండ్రులు ఈ లోకాన్ని వదిలిపోయారు. తరువాత పెదనాన్నగారు ఈకంటకమునే చేరదీసి తమ కన్నబిడ్డవలె చూశారు. ఫలితం, వారూ మరణించారు. చివరికి ఇక్కడికివచ్చి ఇప్పుడు మీ అన్నగారి జీవితానికి కంటకంగా తయారయ్యాను! ఇక నువ్వే మిగిలావు! కానీ, నీవంతు రాక ముందే నువ్వు గాబరాపడుతున్నావా రమేశ్! నేను ఎవరి జీవితానికీ కంటకంగా తయారవదలచలేదు. ఏ విచారమూ లేకుండా నువ్వునిశ్చింతంగా ఉండవచ్చును. నీజీవితానికిభారంగా తయారై జీవించాలనే ఉద్దేశ్యం నాకులేదు, అలాజీవించను.'

'నా ఉద్దేశ్యం అది కాదు సరళా! అన్నగారి ఆశ్రమం నుంచి నావద్దకు రావాలనే నా ఉద్దేశ్యం. అదిచాలా అవసరం గనుక అలా, అన్నాను. నీకు ఆశ్రయం ఇవ్వటానికి నే నెప్పుడూ సిద్ధమే. అయితే, అప్పుడు నాకుకలిగే బాధవేరు. నీకు ఆశ్రయం ఇవ్వటంవల్ల నేను జైలుకువెళ్ళే స్వేచ్ఛను వదులుకోవాల్సి వస్తుంది. నిన్నుగురించి మంచి వాడిగా నడుచుకోవాలి.'

'నువ్వు చేయగలిగింది మాత్రం ఏముంది? అని అడిగింది సరళ.

'సరళా! నీజీవితంలో బాధలే వ్రాసిపెట్టిఉన్నా యనీ, నీజీవిత కుసుమం వికసించే ఆదృష్టానికి నోచుకోలేదనీ నీనమ్మకం! నేను నీకు అండగానిలబడి నీదురదృష్టానికి వ్యతిరేకంగా పోరాడతాను. నీజీవితానికి అదృష్టం తెస్తాను. నువ్వు నాతోకూడా ఉంటే నీకు అదృష్టంఎందుకు పట్టదోచూద్దాం' అన్నాడు రమేశ్.

'రమేశ్! ఆవిషయం నాకు తెలుసు. నీయందు నాకా నమ్మకంఉంది. కాని, ముందు నే నడిగేవిషయానికి జవాబు చెప్పు. అది నీకు చెడుగా కన్పిస్తే, దానిని గురించి మరో విధంగాఅనుకోవద్దు. దానిని మనసులో ఉంచుకొని నువ్వేమీ బాధపడవద్దు.'

'నువ్వు చెప్పదలంచింది చెప్పుసరళా! నే నేమీ బాధ పడనని మాటఇస్తున్నాను' అన్నాడు రమేశ్.

'రమేశ్! నాదిచాలావిచిత్రమైన జీవితం. నన్నుగురించి నీకు చాలా కొద్దిమాత్రమే తెలుసు. దుఃఖ పూరిత మైన

నా జీవితగాథను నీతో చెప్పుకొని కొంతవరకైనా హృదయ భారాన్ని తగ్గించుకుంటాను.'

'నాకూ వినాలని కోర్కెగా ఉంది, చెప్పు సరళా!' అని అన్నాడు రమేశ్.

'జరిగిందేమంటే. నేనూ, ఆదిత్యుడు చిన్నప్పటినుంచీ ఒకేచోట పెరిగి పెద్దవాళ్ళమయ్యాము. పెదనాన్న మాఇద్దర్నీ ఎంతో ప్రేమతో చూసేవారు. మేమిద్దరం సన్నిహిత మిత్రులమై ఆడుతూ, ఒకే కంచంలో తింటూ, ఆనందంగా ఉండే వాళ్ళం. నాతల్లిదండ్రులు పోయినతరువాత పెదనాన్నే నన్ను పెంచి పెద్దచేశారు. వారు నామీద ఎన్నో ఆశలుపెట్టుకున్నారు. తన తరువాత నేను పూదోటకు యజమానురాలనై పూదోట బాధ్యతలన్నీ నేనే చక్కగా నిర్వహించాలని వారి కోర్కె. ఏ మనిషినైనా వారు తేలిగ్గానమ్మేవారు. నామీద వారికి చాలా నమ్మకంఉండేది. అనేకమంది బంధుమిత్రులకు వారు కష్టసమయాలలో అప్పుఇచ్చి సహాయ పడుతూ ఉండే వారు. ఎప్పుడయినా తనకు కష్టంవస్తే వారూతనను ఆదుకుంటారని పెదనాన్న అభిప్రాయం. కానీ, పెదనాన్న చని పోయిన తరువాత ఆదిత్యుడు తప్ప ఎవ్వరూ ఇవ్వవలసినబాకీ తీర్చలేదు. అప్పుల వాళ్ళు పూదోటను వేలం వేయించారు. నా కెక్కడా ఆశ్రయంలేకుండా పోయింది.'

ఒక్కక్షణం ఆగి నిట్టూరుస్తూ ఆమె మళ్ళీ చెప్పనారంభించింది - ఆశ్రయహీనురాలనై చివరకు ఆదిత్యుని ఇంటికి వచ్చాను. చిన్నతనంలో ఎంత స్నేహంగా సన్నిహితంగా, ఉండేవాళ్ళమో ఇప్పుడు అదేమాదిరి ఉండసాగాము. ఆ

విధంగా ఉండటం తప్పనిగానీ, ఉండకూడదనిగానీ నేను ఆలోచించలేకపోయాను ఇంత వయస్సు వచ్చినతరువాత మే మిద్దరం అలా స్నేహంగా ఉన్నందువల్ల బాధలు కలుగుతా యని నాకు ధ్యాసేలేదు. ఒక్క-క్షణకాలం నీరజ నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. అప్పుడు నేను చిన్నపిల్లనుకాదనీ, ఈ వయస్సులో ఇతరులతో కలిసిమెలిసి ఉన్నందువల్ల లోకం మరోవిధంగా అనుకుంటుందని గ్రహించాను. అప్పుడే నా యవ్వనమూ, అందమూ తెలిశాయి.

'అది మంచిదేకదా! బాల్యస్నేహం యవ్వనంలో ప్రేమగా మారవచ్చు. అందులో తప్పేమీలేదే!' అన్నాడు రమేశ్.

'ఇందులో నాదేమీ దోషంలేదు, నన్ను నేను ఎలా మోసగించుకోగలను? ఆదిత్యుని... ...నాలో ఆకర్షణవిమి... దుఃఖంవల్ల సరళ ఆమాట పూర్తిచేయలేకపోయింది.

రమేశ్ ఏమీ మాట్లాడలేదు, ఆలోచిస్తూ కూర్చున్నాడు సరళ తనను తాను నిగ్రహించుకొని ఈ విధంగా చెప్పసాగింది- 'ఆదిత్యుడు, నేనూ ఒకేచోట కలిసిఉన్నంత కాలం సన్నిహితంగానే ఉంటాము. అలా లేకుండా ఉండా లంటే ఒక్క-టేమార్గముంది నేను అతనికి దూరంగా- అతని జీవితమార్గంనుంచి తప్పుకోవాలి. ఇద్దరం ఒకేచోట ఉంటూ దూరదూరంగా ఉండటం అసంభవం; అదీగాక అప్పటికీ అపరాధులమే అవుతాం!'

'అదెలా? అప్పుడు ఎవరేమి అంటారు!'

'నీరజ అనుకుంటుంది.'

'అది నేను అంగీకరించను. మీ చిన్నతనంలో నీరజ ఎవరు, ఎక్కడఉంది! అప్పుడుఉంటే ఆమె మిమ్మల్ని వేరు చేయగలిగేదా? అప్పుడు ఆమెగనుక ఉండి ఇప్పుడు అన్నట్లు అనిఉంటే కొంత అర్థంఉండేది!' అన్నాడు రమేశ్.

ఇంతలో 'రమేశ్' అంటూ ఆదిత్యుడు పిలిచాడు.

'ఏం అన్నయ్యా!' అని బదులు పలికాడు రమేశ్.

ఆదిత్యుడు వారివద్దకువచ్చి రమేశ్‌తో 'మీ వదిన నిన్ను రమ్మంటుందని రోషీనీవచ్చిచెప్పి వెళ్ళింది' అన్నాడు.

రమేశ్ లేచి వెళ్ళిపోయాడు సరళకూడా వెళ్ళాలని లేచి నిలబడింది. కాని, ఆదిత్యుడు ఆమె చెయ్యిపట్టుకొని 'సరళా! నీతో మాట్లాడాలి' అంటూ ఆమెను అక్కడేఆపాడు.

సరళ అలాగే నిలబడి ఒక్కసారి ఆదిత్యునిముఖంలోకి చూసింది. అతని హృదయంలో జరుగుతున్న సంఘర్షణను ఆమె గ్రహించింది. అతని పెదవులమీద ఎప్పుడూ చిరునవ్వు చిందుతూఉండేది. కానీ, ఇప్పుడు చిరునవ్వుకు బదులు విషాదం గోచరిస్తుంది. అమృతమయమగు అతని జీవితభాండంలో విషం కలిపినట్లుంది. దుస్సహ హృదయావేదనతో కుమిలి పోతున్నాడు.

మనస్సును నిగ్రహించుకొని 'సరళా! మనిద్దరి జీవితాలు రసభరితమై ఒకే ప్రవాహంగా సాగాయి. ఇవాళ వేరవటం సాధ్యమా? అసంభవం? అని అన్నాడు.

సరళ అతని మాటలకు అడ్డొస్తూ 'ఒకే వృక్షానికి అనేక కొమ్మలు ఉంటాయి. అవి దేనికది వేరుగానే ఉంటాయి' అని అంది.

'వేర్వేరు తత్వం అక్కడ ఏమీఉండదు. ఆకొమ్మలు దేనికది వేరుగా ఉన్నప్పటికీ వాటి శరీరం ఒకటే. వాటికి కావలసిన ఆహారము నీరు అందిచే బోదెఒక్కటేగదా! వాట న్నిటి జీవిత ఆధారం, విధానం ఒక్కటే అయినప్పుడు వేర్పాటు అనేసమస్యరాదు. ప్రపంచ దృష్టిలో అవి దేని కదే; కానీ వాటికి పరస్పరం ఎడబాటు ఉండదు. సరే, ఆసం గతి అలాఉంచు; ఇవాళ నామనస్సు చాలా గాయపడింది, ఇలా జరుగుతుందని కలలోకూడా అనుకోలేదు. ఈగాయాన్ని జీవిత పర్యంతం మర్చిపోలేను.'

మీమనస్సు ఎంతగా గాయపడింది. మీరెంత కుమిలి పోతున్నదీ, మీరుచెప్పకుండానే నేను అర్థం చేసుకున్నాను. జరగాల్సిందేదో జరిగిపోయింది' అంది సరళ.

'ఆగాయాన్ని నువ్వు భరించగలవా సరళా?'

'అంతకంటేమరోకమార్గం ఏముంది?భరించకతప్పదు.

'పురుషులకంటె స్త్రీలలోనే ఎక్కువ సహనశక్తి ఉంటుందని అంటారు. అది నిజమేనని ఇప్పుడు తెలుసు కున్నాను.'

'సహించక స్త్రీలు చేయగలిగిందేముంది? తరతరా లుగా ఆమె పురుషునివల్ల బాధలు అనుభవిస్తూ వస్తుంది. పురుషుల అనేక అత్యాచారాలు ఆమెసహిస్తుంది సహనము నిదానము ఆమెకు శరణ్యం కన్నీరు ఆమె చివరిఅస్త్రం. దుర్భరపరిస్థితుల్ని భరించలేనప్పుడు కాస్సేపు ఏడుస్తుంది. ఏడ్వటంవల్ల సహజంగా కొంత శాంతిలభిస్తుంది!'

ఆదిత్యుడు ఉత్తేజితుడై 'మనిద్దరినీ వేరుచేస్తే నేను భరించలేను! అలా జరగటానికిప్పీల్లేదు మనంఒకటిగాఉంటూ వచ్చాము; ఇకముందుకూడా ఒకటిగానే ఉందాం' అని అన్నాడు.

సరళ ఆదిత్యుని భుజంమీద చెయ్యివేసి అతనిని శాంతింపజేస్తూ 'బావా, శాంతంగా ఆలోచించు. ఈ ప్రపంచం సుఖంగా ఎవర్ని బ్రతకనిచ్చింది? జీవితమంటేనే వ్యధ, సంఘర్షణ! దీనికి ఒకర్ని నిందించి లాభంఏమిటి? ఇందులో ఒకరి తప్పేముంది?' అని అంది.

ప్రపంచము యొక్క యీ నిందాద్వేషపూరిత ప్రభావాన్ని నీవుసహించగలవా? సరళా? నీవు దీనిని సహింపజాలవని నాఉద్దేశ్యం'

సరళ అందుకేమీ మాట్లాడలేదు. ఆదిత్యుడు తన ఆవేశాన్ని నిగ్రహించుకోలేకపోయాడు. తనమనస్సులోఉన్నదంతా చెప్పసాగాడు-

'మన చిన్ననాటి మధురస్మృతులు నాకు నిన్న మొన్న జరిగిన నట్లుంటాయి. అవి ఎప్పుడూ నాకళ్ళల్లో మెదులుతూనే ఉంటాయి. అందమైన నీశిరోజాలను, పొడవైన జడను చూచుకొని అప్పుడు నువ్వు చాలా గర్వపడుతూ ఉండేదానివి. నీకు గుర్తుందా, ఒకనాడు నేను నిన్ను వెతుక్కుంటూ వచ్చాను; అప్పుడు నువ్వు నిద్ర పోతున్నావు. మధ్యాహ్న సమయమనుకుంటాను. నేను నీ జడను కత్తిరించాను నువ్వు నిద్రలేచి చూచుకొని నామీద కోపగించుకుంటావనీ, ఏడుస్తావనీ అనుకున్నాను. నిద్రలేచిన తరువాత నీకు నిజంగానే

చాలా కోపం వచ్చింది. కానీ, నువ్వునామీద ఏమీ కోపం చూపించలేదు. మామయ్య నీజడ ఏమయిందమ్మా అని అడిగినప్పుడుకూడా నువ్వు నన్ను గురించి ఏమీ చెప్పలేదు. వేడిభరించలేకుండా ఉందనీ అందుకు జడకత్తిరించుకున్నానని చెప్పి సంభాషణను మార్చివేశావు. నువ్వునాకు దక్కలేదు గనుక ఆనాటి మధురస్మృతులను మరచిపోమ్మంటావా? అది ఈజీవితంలో జరగదు. మర్చిపోవటం అసంభవం సరళా!'

సరళ చిరునవ్వునవ్వుతూ 'ఆదిత్యా, ఆనాడు జరిగిన దానిని బట్టి నేను చాలా ఓర్పు వహించానని అనుకుంటు న్నావా? అలాంటిదేమీలేదు. నేను ఆలోచించే అలా వ్యవ హరించాను. అలాఉండి నిన్ను చాలాభయపెట్టగలిగాను. నేను మామయ్యతో చెప్పిఉంటే నువ్వు అంతగాబరా పడేవాడివి కాదుగదా!' అని అంది.

'నిజమే సరళా! నిజం చెప్పాలంటే నీ జడను కత్తి రించినందుకు నేను చాలా విచారించాను నేను చేసిన తెలివి తక్కువపనికి బాధపడ్డాను. అలాంటి పాడుపని చేసినందుకు సిగ్గుతో నీముఖం చూడలేక కొద్దిరోజులు తప్పుకు తిరిగాను. మళ్ళీ నీకు మామూలుజడ వచ్చేవరకు నీకు కన్పించకూడదను కున్నాను. కాని, నేను నాగదిలోకి రావద్దని ఎన్నిసార్లు చెప్పినా నువ్వునన్ను వదలి పెట్టేదానివి కాదు. నన్ను బల వంతాన తోటలోకి లాక్కుపోయి అక్కడనాతో ఏదో ఒక పని చేయిస్తూ ఉండేదానివి. నేను నీజడను కత్తిరించినసంగతే మర్చిపోయినట్లు, లేదా అలాంటిదేమీ అసలు జరగనట్లే నాతో చాలా ప్రేమగా ఉండేదానివి. మరొకసంగతి, ఆ తు

పానుగురించి నీకు గుర్తుందా; అబ్బా, చాలాభయంకరమైన తుఫానుసుమా! నా పాక కప్పుకూడా ఎగిరిపోయింది.'

'ఇప్పుడు ఆ సంగతులన్నీ గుర్తుచేసుకోవటం వల్ల లాభంఏమిటి? ఇక ఆరోజులు తిరిగిరావుకదా!' అంటూ సరళ నిట్టూర్చింది.

సరళ వెళ్ళాలనిలేచి నిలబడబోయింది; కాని ఆమెవెళ్లి పోవటం ఆదిత్యునికి ఇష్టంలేదు. అందుకని అతడు ఆమెచేతిని పట్టుకొని ఇలా చెప్పసాగాడు-

'సరళా. కాస్సేపుకూర్చో. నువ్వునన్నువదలి దూరంగా ఉండటానికి వీల్లేదు. నువ్వునాతోనే ఉంటావుకదూ! ఈ పది సంవత్సరాల గృహస్థజీవితంలో ఎన్ని బాధలు అనుభవించానో నీకు తెలుసా! అందుకు ప్రతిఫలంగా నాకెప్పుడూ ఈర్ష్యాద్వేషాలే లభించాయి. ఇవన్నీ నాకెందుకు వచ్చినట్లు? నేను చేసినపాపం ఏమిటి? నువ్వంటే నీరజకు ఈర్ష్యఎందుకు? ఇరవై మూడు సంవత్సరాల మనస్నేహంకంటె తన పదిసంవత్సరాల దాంపత్యజీవితం అధికమని ఆమె ఉద్దేశ్యమా? మనిద్దరం ఒక చోట ఉండటం ఆరంభించినప్పుడే మన మనస్సులు ఏకమయ్యాయి. నీరజ ఇవాళ మనిద్దరినీ వేరుచేయాలని ఎందుకు ప్రయత్నిస్తుంది? అసలు మనల్ని వేరుచేయాలనే కోర్కె ఆమెకు ఎందుకు కలిగింది!'

'వెనుకటి సంగతుల్లో నాకు అంతగా గొప్పతనం ఏమీ కన్పించటంలేదు అలాంటప్పుడు ఈనాడు ఇంతఈర్ష్యా, ద్వేషం ఎందుకోనాకు బోధపడటంలేదు. అదే నన్నెక్కువగా బాధిస్తున్న విషయం. మీ ప్రవర్తనలోకూడా మార్పేమీ

లేదు, మరి ఈవిధంగా ఎందుకు జరుగుతుందో?' అని అన్నదిసరళ.

ఆదిత్యుడు కాస్సేపటివరకు ఏమీమాట్లాడలేదు. తరువాత ఇలా జవాబు చెప్పాడు.' కాని, ఒకవిషయం మాత్రం స్పష్టంగా కనిపిస్తుంది. నువ్వులేకుండా నా జీవితం చాలా నిస్సారంగా ఉంటుంది; జీవించలేనేమో కూడా! నాలో యవ్వనం తొంగిచూసినప్పుడే నిన్ను నేను నాహృదయంలో నిలుపుకున్నాను. ఇవాళ నువ్వునాకు దూరమవటం నేనుభరించలేను! నువ్వు నాకు దగ్గరగాఉండాలనే నేనుసర్వదా కోరుతూ వచ్చాను.'

'మీ మాటలు నాకుచాలా దుఃఖం కలిగిస్తున్నాయి. మీారిక ఈవిషయాన్ని గురించి మాట్లాడి నన్ను మరింత బాధించకండి! నన్ను ఆలోచించుకో నివ్వండి' అని అంది సరళ.

'సరళా! అలాఅంటే నేను అంగీకరించను. దుఃఖించి నందువల్ల పరిస్థితులు చక్కపడతాయా? జీవితంలో అడుగు పెట్టేటప్పుడు మనకు రాబోయే కష్టసుఖాలు ఏమిటో మనకు తెలుసా? ఏమీ తెలియవు. మనస్నేహ సంబంధాలను విస్మరించగల చిత్తస్థైర్యం నాలోలేదు! నీలో ఆసామర్థ్యం ఉన్నదేమో కాని నేనాపని చేయలేను!'

సరళ అతివినమ్రతతో 'ఆదిత్యా! నన్ను మరింత కుంగదీయకు! నేను నీ పరిస్థితుల నుంచి బయట పడాలని ప్రయత్నిస్తున్నాను. నీమాటలు నామార్గాన్నికష్టతరం చేస్తున్నాయి'. అని అంది.

ఆదిత్యుడు ఆవేశంతో ఆమె రెండు చేతులూ పట్టుకొని 'సరళా! నేను నిన్నెప్పుడూ ప్రేమిస్తున్నాను. అప్పుడూ ప్రేమించాను, ఇప్పుడూ ప్రేమిస్తున్నాను. జీవితనిర్వాహణకై నన్నువదలి నువ్వెక్కడికో వెళ్ళటం నాకు ఇష్టంలేదు. నాహృదయంలో నిండి ఉన్న ప్రేమవృక్షాన్ని పెకలించి వేయ మంటావా సరళా? నేను నీఎడబాటును భరించలేను' అన్నాడు.

'ఆదిత్యా! ఇకమాట్లాడకు! నా మనస్సు వికలమై పోతుంది. నా కేమిటో గాబరగా ఉంది. ఈ రాత్రి నన్ను శాంతంగా ఆలోచించుకోనివ్వు' అంది సరళ.

'సరూ! నువ్వెంత మంచిదానివి! నన్ను మన్నించ మని అడగటానికి మాటలు దొరకటం లేదు! అంధుడనై నీ ప్రేమను గుర్తించలేక పోయాను. ఆ పొరపాటు వల్ల నన్ను నేను వివాహ బంధనంలో బంధించుకున్నాను. నువ్వు నీ ప్రేమను చివరి వరకు నిర్వహించావు. అవివాహితగా ఉండి పోయావు. అనేక మంది నిన్ను వివాహం చేసుకోమని కోరిన సంగతి నాకు తెలుసు! కాని నువ్వు నీ ప్రేమను నాకు అర్పించావు! దానిని మరొకరికి ఇవ్వటం ఇష్టం లేకనే గదా, నువ్విలా ఉండిపోయావు. నాకు తెలుసు సరూ! నాకు అన్నీ తెలుసు!'

సరళ కొంచెం తడబడుతూ 'అలాంటి దేమీలేదు. పెదనాన్న పూదోట బాధ్యతను నాకు అప్పగించారు ఆ కర్తవ్య నిర్వహణకోసమనే నేనువివాహమాడలేదు ... లేనిచో నేను ... ...' అని ఆమెమాట పూర్తవకముందే ఆదిత్యుడు మధ్యలో అడ్డొస్తూ ఇలా అన్నాడు-

'సరూ! నువ్వు నన్ను మరిపించాలని చూస్తున్నావు; కాని దీనికంతటికీ నేనే కారకుణ్ణని నాకు తెలుసు. నాపై నీహృదయంలో ఉన్న ప్రేమానురాగాలు నాకు తెలుసు. నేను నా ప్రేమను మరొక స్త్రీకి పంచి ఇచ్చాను;నువ్వుమాత్రం నీ ప్రేమను మరెవ్వరికీ ఇవ్వలేదు. ఇప్పుడు దుఃఖించినందువల్ల ఏం ప్రయోజనం? వివాహానికిముందేనువ్వునాకీజ్ఞానంకలిగించి ఉంటే ఎంత బాగుండేది! ఆనాడు గుర్తించలేక పోయినందుకే ఇవాళ ఏడుస్తున్నాను. అలాచేసి ఉంటే ఇవాళ ఇదంతా జరిగి ఉండేది కాదుగదా!'

'అనవసరంగా మనస్సును పాడుచేసుకుంటారెందుకు? జరిగి పోయిన దానిని ఇప్పుడు తిరిగితేవటం సాధ్యంకాదుగదా! ఇప్పుడు చింతించి నందువల్ల గానీ, దుఃఖించినందువల్ల గానీ ఏమీ ప్రయోజనం ఉండదు. ముందు చేయ వలసిందేమిటో ఆలోచించుకుందాం.'

'సరే; నీయిష్టం! అలాగే చేద్దాం'. అంటూ ఆదిత్యుడు ఒక పుష్ప గుచ్ఛాన్ని అందుకొని సరళకు ఇస్తూ' దీనిని నా ప్రేమచిహ్నంగా నీవద్ద ఉంచు' అనిచెప్పిఇచ్చాడు.

సరళ మౌనంగా తన అంగీకారాన్ని తెలిపింది. ఆదిత్యుడు ఆ పుష్ప గుచ్ఛాన్ని పిన్నుతో ఆమె భుజం మీద తగిలించాడు ప్రేమగా ఆమె ముఖం లోకి చూస్తూ నిలబడ్డాడు; సరళ వెళ్ళిపోబోతుఉండగా అతడు మళ్ళీ ఆమెను ఆపివేశాడు. ఆమె తనను వదలి వెళ్ళటం అతనికి ఎంత మాత్రం ఇష్టం లేదు. ఆదిత్యుడు ప్రశాంతంగా ఆమె ముఖం లోకి చూస్తూ ఉండిపోయాడు. సరళ హృదయంలో తుఫాను

రేగింది. ఆమె ఇక ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడ లేక పోయింది, చేతులు విడిపించుకొని తన గదిలోనికి పరుగెత్తుకొని వెళ్ళింది.

సరళ కంటికి కన్పించే వరకు ఆదిత్యుడు అటే చూస్తూ నిలబడ్డాడు. తరువాత కొలను మెట్లమీద కూర్చొని శూన్యాకాశం లోకి చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఇంతలో నౌకరువచ్చి భోజనసమయ మయిందని గుర్తు చేశాడు.

'నాకు ఇవాళ ఆకలిగా లేదు' అని జవాబుచెప్పి ఆదిత్యుడు మళ్ళీ తన ఆలోచనల్లో మునిగి పోయాడు.

# 6

రమేశుడు నీరజ ఉన్నగది ముందుకు వెళ్ళి 'వదినా, పిలిచావా?' అని అడిగాడు.

గబగబ కన్నీరుతుడుచుకొని 'లోనికిరా, మరదీ' అని అంది నీరజ.

'రా! మరిదీ.'

వాతావరణం అతి ప్రశాంతంగా వుంది. గదిలో చీకటిగావుంది. నీరజ తనదిండును ఆనుకొని కూర్చొని ఉన్నది. దిండువద్ద ఆదిత్యుడు ఇచ్చిన పూరగుత్తి ఉంది. తెరచిఉన్న కిటికిలోనుంచి వెన్నెల గదిలో ప్రవేశిస్తూ ఉంది. వెన్నెల మంచముమీద పడుతూఉంది. దూరముగా తోటలో ఉన్న లతా మండపము కానవచ్చుచున్నది పిల్లగాలులు చెట్లఆకులకు గిలిగింత పెడుతున్నాయి. మామిడి పూతనుండి సువాసనలు

వెలువడి, నలుదిశలు వ్యాపించుచున్నవి. దూరమునుండి జాన పదుల పాటలు వినబడుతున్నాయి. కోయిల మధురముగా కూయుచున్నది. మంచము క్రింద మిఠాయిలు, పళ్ళు, ఉన్నాయి ప్రకృతి ప్రశాంతగా ఉంది.

రోగివి శ్రాంతికి విఘ్నం కలుగకుండా ఉండుటకుగాను అందరూ నిశ్శబ్దంగా ఉన్నారని, దానివల్లవ్యక్తమవుతుంది. రమేశుడు కుర్చీని మంచమునకు దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు. నీరజ నీరసంగా ఉంది. ఇంతకు పూర్వమే ఆమె వడ్చివడ్చి ఉన్నదేమో; అందువలన, మరీ నీరసపడింది. తన దౌర్బల్యం అతనికి కన్పించకుండా వుండాలనిఆమెఉద్దేశ్యం. అందువలన, కాసేపటివరకు ఆమె మాట్లాడ లేదు. తన మనస్సును నిగ్రహించు కుంటున్నట్లు నటించ సాగింది. తన హృదయసాగరంలో చెలరేగుచున్న తుఫానునుఅణుచుకుంటూ ఆమె మధ్యమధ్య పిడికిళ్ళు బిగించసాగింది. ఆబిగింపుకు, ఆమె చేతిలోనున్న పువ్వులు నలిగిపసరు గ్రక్కసాగినాయి.

తన మానసికస్థితిని సంబాళించుకున్న తరువాత నీరజ ఒక లేఖను తీసి! రమేశునకు ఇచ్చింది. ఆలేఖ ఆ దిత్యుడు వ్రాసినది. ఆలేకలో యిలా వ్రాసిఉంది.

'పది సంవత్సరాల దాంపత్య జీవితంలో మనంఎంతో అన్యోన్యంగా ఉన్నాం. అందువల్ల మన యిద్దరికీ ఒకరి విషయాలు మరొకరికి పూర్తిగా తెలుసు తెలియని వంటూ లేనేలేవు మనయిద్దరి మధ్యను అడ్డుగోడలంటూలేవు. ఈవిష యం నీకు తెలిసివుండికూడా నాప్రవర్తనను శంకించావు. ఇది నేను సహించలేని విషయం! నాపై నీవుమోపినదుర్లక్షణాలను

కాదని నిరాకరించినా, అంతకన్నసిగ్గుమాలిన విషయమేమీ ఉండబోదు, నీమనస్సులో అనుమానపిశాచం ప్రవేశించింది. దానివల్ల నేను చేసేప్రతి పనినీ నువ్వు సంశయ దృష్టితో చూస్తున్నావు ;ఉద్రేక పడుతున్నావు.

రోగంతో బాధపడుతున్న నువ్వునామూలంగాఉద్రేక పూరితురాలవటం నాకు ఇష్టం లేదు. దాని వల్ల నీరోగం మరింతహెచ్చుతుంది. కనుక, నేనురోజూనీవద్దకు మామూలు ప్రకారం రావటం మంచిది కాదని భావిస్తున్నాను. వాయిద్యం ఉందేకాని అది మ్రోగదు, అన్నసామెతవలె వ్యవహరింపదలచాను. నీ మనస్సులోని విషయాన్ని కూడా అర్థం చేసుకున్నాను. సరళను మన యింటినుండి పంపి వేయాలని నీకోర్కె. బాగా ఆలోచించిన తరువాత నేసరళను పంపివేయాలనే నిర్ణయానికి వచ్చాను దీనివల్ల నీమనస్సుకు శాంతి కలుగవచ్చునేమో కాని మామయ్య నాకు చేసిన మేలును, ప్రత్యుపకారం చేయాల్సిన బాధ్యత కూడా నా మీద ఉంది. ఆయన ఆనాడు నాకు చేసిన సహాయం వల్లనే ఇవ్వాళ నేనీస్థితిలో ఉండ గలిగాను. ఆయన సహాయంచేసి ఉండకపోతే నే నివాళ ఎక్కడో కొద్దిపాటిజీతం తెచ్చు కునే గుమస్తాగా బ్రతుకుతూ ఉండేవాడిని. అందుకని నిరా శ్రయురాలై నిస్సహాయ స్థితిలోఉన్న సరళను నిరాధారంగా వదలి వేయుటం భావ్యంకాదని అను కుంటున్నాను. నేను అంత అధర్మంగా నడుచుకోలేను.

'మరేం చేయాలి అని తీవ్రంగా ఆలోచించాను. నాకొక మార్గం కన్పించింది. పూలవిత్తనాల వ్యాపారాన్ని

తిరిగి ప్రారంభించటం అన్ని విధాలా మంచిది. మాణిక్య తల్లాలో అందుకు వీలుగా ఉండే ఒక తోట, ఇల్లుకూడా దొరుకుతాయి. ఆ వ్యాపారాన్ని పూర్తిగా సరళకు వదలి వేయాలనిఆలోచించాను. దీనికికావలసినంత డబ్బు ప్రస్తుతం మన వద్దలేదు గనుక ఈ విషయాన్ని గురించి నీతో చెబు తున్నాను. నువ్వు అంగీకరించేట్లయితే, మన పూదోటను, ఇంటిని కుదువ పెట్టి కావలసిన డబ్బు తీసుకుంటాను. మనం ఈతోట పని ప్రారంభించాలనుకునే క్రొత్తలో నా వద్దకావ లసినంత డబ్బు లేక పోయింది; అప్పుడు మామయ్య వడ్డీ లేకుండా మనకు అప్పు ఇచ్చాడు. ఆడబ్బుతోనే మనం తోట ను కొనుక్కున్నాం. అప్పుడు వారివద్దకూడా డబ్బులేకపోతే, మన కోసమని వేరేచోట అప్పు తెచ్చి ఇచ్చారు. తరువాత మనం వడ్డీలేకుండా అసలు చెల్లించాము. ఈ విషయాలన్నీ నీకు తెలిసినవే. పూదోటకు కావలసిన విత్తనాలను, పనిముట్ల ను, మొక్కలను ఆయన మనకు ఉచితంగాఇచ్చాడు.

'ఆనాడు వారు మనకు అంత సహాయం చేసి ఉండక పోతే ఇవాళ మనం ఇంత స్థితిలో ఉండగలిగే వాళ్ళమా? అసలు, నాకు వివాహం జరిగేదా! నాలాంటి దరిద్రునికి పిల్ల నెవరిస్తారు? ఇంత కాలం అజ్ఞానంలో ఉన్ననాకు నువ్వు క్షణం జ్ఞానోదయం కలిగించావు. సరళకు నేను ఆశ్రయం ఇచ్చానా లేక ఆమె ఆశ్రయంలో నేనే బ్రతుకుతున్నానా అనేది ఆలోచించేటట్లు చేశావు. నేను పూర్తిగా మరచి పోయిన విషయాన్ని ఇవాళ నాకు జ్ఞాపకంచేసి మహోప కారం చేశావు! అందుకు నీకు అనేక ధన్యవాదాలు.

'నువ్వు నాకు నీ ప్రేమను అర్పించి ఉండవచ్చు, నీసర్వస్వాన్నీ నాకు ఇచ్చి ఉండవచ్చు; కానీ ఇవాళ నువ్వు నా కళ్ళు తెరిపించటం నాకు నిజంగా మహావరప్రసాదం. దీనిని నేను మర్చిపోను. నాహృదయంలో పదిలపర్చుకుంటాను. సరళను ఒకకంటకంగా భావించి ఆమెను వదిలించుకుందామనే ఆలోచించాను. కాని నువ్వునాకు జ్ఞానోదయం కల్గించిన తరువాత ఇప్పుడు ఆమెను ఏలా వదల గలను? ఆమె ఋణాన్ని తీర్చుకోవలసిన బాధ్యత నామీద ఉంది. అదినాకర్తవ్యం. ఆమె ఎల్లవేళలా నాకు సహాయపడుతూ ఉండేది. అలా నేను కూడా ఆమెకు సహాయపడి ఆమె ఋణాన్ని తీర్చుకోగలనా! అవకాశం ఉన్నప్పుడు తీర్చుకోలేనట్లయితే జీవిత పర్యంతం ఋణభారం పెరగటమేకాని తీర్చుకోవటం జరుగదు.'

ఆ ఉత్తరాన్ని అయిదారుసార్లు చదివి రమేశ్ శాంతంగా ఆలోచించసాగాడు.

నీరజ లోలోపల బాధపడుతూ 'ఇప్పుడు ఏమంటావ్ మరదీ?' అని అడిగింది.

రమేశ్ జవాబేమీ చెప్పకుండా ఇంకా తన ఆలోచనలోనే మునిగిఉన్నాడు.

ఉన్నకొద్దీ నీరజ మరింత ఆవేశపూరితురాలై, అమిత దుఃఖంలో మొదలు నరికిన వృక్షంవలె కూలిపోయింది.

'అయ్యో! నేను చాలా అన్యాయంచేశాను! ఈ పొరపాటును సవరించుకోవటం ఎలా? అసలు, నాకు ఇటువంటి ఆలోచనలు ఎందుకు కలిగాయి! మీరు నన్ను అర్థం చేసు

కొని మన్నిస్తారా? లేక ఆ మాటలనేపట్టుకొని కూర్చుంటారా! అంటూ నీరజ నెత్తినోరు బాదుకుంటూ విలపించసాగింది.

'వదినా! ఓర్పు వహించు! ఇలా ఏడుస్తూకూర్చుంటే ఆరోగ్యం మరింత చెడిపోతుంది. అనవసరంగా మనస్సును పాడుచేసుకోవద్దు' అని రమేశుడు వదినను ఓదార్చసాగాడు.

'మరదీ! అసలు, ఈరోగమే నాకొంపతీసింది. హాయిగా సాగిపోతున్న మా జీవితనౌకను నిలవరించివేసింది. ఇక నా జీవితంలో మిగిలేదేముంది? ఇంకా దేనికోసమని జీవించాలి? అయ్యో భగవంతుడా! పాపిష్టిదానను, భర్తనే శంకించాను! ఇప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనం ఏముంది? ఆ రోజుల్లో వారు నన్ను ప్రేమతో 'మాలినీ!' అనో, వనదేవీ!' అనీ 'నీరూ!' అంటూ రకరకలుగా పిలుస్తూఉండేవారు. ఇవాళ నేను ఆ ప్రేమానురాగలకు పూర్తిగా దూరమైపోయాను. ఆనాడు వారి ప్రేమకు నే నే సర్వాధికారిణిని, వారి హృదయాధిదేవతను! వారు ఎప్పుడైనా ఇంటికిరావటం ఆలస్యమైతే పళ్లెంలో అన్నంవడ్డించి వారికోసం ఎదురుచూస్తూ కూర్చునేదానిని. అటువంటిసమయాల్లో వారు నన్నుప్రేమతో 'అన్నపూర్ణా' అని పిలిచేవారు.

సాయంత్ర సమయాల్లో భోజనం చేసిన తవారుత వారు కొలను గట్టున షికారుకు వెళుతూ ఉండేవారు. నేను ఆకులు వక్కలు తీసుకు వెళ్ళేదానిని. నన్ను చూసి 'తాంబూల విహారిణీ!' అని పిలిచేవారు. గృహవిషయాలను గురించి మాట్లాడుతున్నప్పుడు నన్ను 'గృహమంత్రీ' అని అనేవారు.

ఒక్కొక్కప్పుడు ప్రేమావేశంలో 'హాంశక్రటరీ' అనిఅంటూ ఉండేవారు.

'మరదీ! అది ఎంత మధురమైన జీవితం! ఆనాడు వారి ప్రేమ సర్వదా జీవనదివలె నిండుగా ప్రవహిస్తూఉండేది. నేను ఆపూదోటలో వనదేవతవలె సంచరిస్తూ ఉండేదానిని. యవ్వన పరిపూర్ణమగువసంతంవలెఆరోజుల్లో వారునాయందు అమిత ప్రేమ చూపించేవారు. ఇవాళ ఆ ప్రేమ వృక్షపు ఆకు రాలే కాలంవచ్చింది. వారిజీవితానికి చికాకుకల్గించే దానిగా తయారయ్యాను. ఇలా ఎందుకు జరిగింది?' అని నీరజ దుః ఖించ సాగింది.

'వదినా! విచారించకు. ముందు నువ్వు ఆరోగ్యవంతు రాలవై లేచి తిరుగు! అప్పుడు నీ అధికారం నీకు తప్పక లభి స్తుంది. అప్పుడు నువ్వు మళ్ళీ రంగురంగుల పుష్పభరితమైన ఈ రంగమహల్‌కు మహారాణివి అవుతావు. తిరిగి ఎప్పటివలె గౌరవం పొందగలుగుతావు. విచారించకు, మళ్ళీ నీకుమంచి రోజులు వస్తాయి' అన్నాడు రమేశ్.

'మరదీ!నువ్వుకూడా నాతో అబద్ధాలుచెబుతున్నావు. డాక్టర్ల అభిప్రాయం ఏమిటో నేను నాచెవులతో అనేకసార్లు విన్నాను అది విన్నతరువాత ఇక నేను ఆరోగ్యలాభంపొంది, తిరిగి నాస్థానాన్ని పొందాలని ఆశించటం మూర్ఖత్వమే అవు తుంది. నేను రోగిని, నాజీవితం ఇక ఇంతే' అని అంది నీరజ.

'అవేంమాటలు వదినా!' అన్నాడు రమేశ్ ఆమె మాటలకు అడ్డొస్తూ.

'నిజమే చెబుతున్నాను మరదీ! నా జీవితంలో మిగిలిందేమీ లేదు. ఆరోగ్యవంతురాలనవటం ఇక జరగనిపని ! నా శరీరం పూర్తిగా శిథిలమైపోయింది' అని అంది నీరజ.

'వదినా! నువ్వు ఈయింటి కోడలివై ఇక్కడికి వచ్చిన నాటినుంచి, ఈ సంసారంకోసం ఎంతో త్యాగంచేశావు! నువ్వీ సంసారాన్ని ఎలా చక్కదిద్దుతూవచ్చావో నాకు తెలుసు. అన్నయ్యకు నీ ప్రేమను దోచిఇచ్చావు! పూదోటను ప్రాణసమంగా చూసుకున్నావు. ఇంటికి కళ తెచ్చావు. అందరికీ ఏదో ఒక సహాయం చేస్తూనేఉన్నావు. అంతధర్మబుద్ధితో చాలా హుందాగా జీవించిన నువ్వు ఈనాడు సంకుచిత బుద్ధితో వ్యవహరిస్తావా? ధర్మగుణసంపన్నురాలవని ప్రసిద్ధి చెందావు! ఇవాళకూడా అలాగేఉండు! వదినా, నేను కోరేది ఇదే. ఒకరికి ఇవ్వటమే నీ జీవితానికి వన్నె తెచ్చింది అదే నీకు సుఖసంతోషాలు కలిగించగలదు నువ్వు ఎప్పుడూ అలాగే ఉండాలివదినా!'

'నేను ఆవిధంగా ఉన్నమాట నిజమేమరదీ! ఆనాడు నేను ఒరులకు ఏదిఇచ్చినా సంతోషంగా, హృదయపూర్వకంగా ఇచ్చేదానిని. ఆనాడు లభించిన గౌరవప్రతిష్టలు ఈ జీవితానికి చాలు. ఇవాళ మిగిలిఉన్న నాజీవితధనాన్ని చేతులారా ఇతరులకు దానంచేయాలని లేదు నాకు. నాగుబాము వలె నేను కాపాడుకుంటూవచ్చిన నాజీవితనిధిని సరళ దోచుకుందేమో అనే నావిచారం! నేను నాసర్వస్వమూ ఇతరులకు అర్పించి నాకోసం దాచుకున్న వస్తువును సరళ దోచుకోవా

లని ప్రయత్నిస్తుంది మరదీ! విధినిర్ణయం ఇదేనా, ఆవిధాతకు మాత్రం ఇదేమిన్యాయం?!

'వదినా! నువ్వు చెడుగా భావించనంటే ఒక సంగతి చెపుతాను. నీతో చెప్పవద్దనుకొనికూడా చెప్పకుండా ఉండ లేకపోతున్నాను. చెప్పటానికి మనస్సు అంగీకరించటంలేదు. అయినా చెప్పకతప్పదు నువ్వు అనుభవించలేవు. అయినా ఆ వస్తువును ఇతరులకు ఇవ్వనంటావు; అంతేనా! ఆదేమి న్యాయం? దానధర్మాలుచేసిన నువ్వు దీనినికూడా సంతో షంగా దానంచెయ్యి. అలా చేయనిచో నీప్రేమకు శాశ్వత మైన మచ్చ ఏర్పడుతుంది. ప్రేమకు త్యాగమే మూలమం త్రం! కళకళలాడుతూఉండే సంసారం నీలోభితనంవల్ల నాశనమైపోవాలనే నువ్వు కోరుతున్నావా? జీవిత చరమక్షణం కంలోఉన్న నువ్వు లోభితనం చూపించకు. ఇదినాఉద్దేశ్యం. నేను నీకు చెప్పేసలహా ఇదే!'

అతని మాటలు విని నీరజ వెక్కి వెక్కి ఏడ్వసాగింది. రమేశ్ మెదలకుండాకూర్చుని ఆమెహృదయంలో రేగుతున్న కల్లోలాన్ని గమనించ సాగాడు.

కన్నీటితో నీరజ తన హృదయమాలిన్యాన్ని క్షాళణం చేసుకో సాగింది. కాస్సేపటికి మనస్సును నిగ్రహించుకొని లేచి కూర్చుంది. క్షణకాలం ఏదో ఆలోచించి 'మరదీ! నిన్నొక భిక్ష అడుగుతున్నాను. లేదనవుగదూ? అని అడిగింది'

'అవేం మాటలు వదినా! నువ్వేది అడిగినా చేయ టానికి నే నెప్పుడూసిద్ధమే' అన్నాడు రమేశుడు.

'ఈ చిక్కులవల్ల నామనస్సు ఎంతో క్షోభ పడుతూ ఉంది. అలాంటప్పుడు ఏడ్వాలని అనిపిస్తూఉంటుంది. ఆ కన్నీటితో కాస్సేపటికి హృదయావేదన చల్లారుతుంది. కాని చిక్కులు మాత్రం అలాగే ఉండిపోతాయి. అటువంటి సమయాల్లో పరమహంస చిత్రపటంవంక చూస్తూకూర్చుంటాను. దానివల్ల ఆమహాత్ముని దివ్యకిరణమేదైనా నాపై ప్రసరించి నాకు మార్గాన్ని చూపిస్తుందేమో నని ఆశ. గురువు వల్ల జ్ఞానమూ, జ్ఞానంవల్ల మోక్షమూలభిస్తాయి. ప్రాపంచిక బంధనాల్నుంచి విముక్తి పొందినప్పుడే మోక్షమార్గం సులభ సాధ్యమవుతుంది. కనుక, ఈ బంధనాల్నుంచి విముక్తి పొంది నన్ను నేను ఉద్ధరించు కోగల మార్గమేదైనా చూపించు!'

'వదినా! నువ్వు మంచిసంగతే అడిగావు! అందులో నావంటి నాస్తికునకు— ఇహపరాలన్నా, మోక్షంఅన్నా ఏమాత్రం నమ్మకంలేని నన్నా మోక్షమార్గం అడుగుతున్నావు? ఈ బంధనాలనుంచి విముక్తిపొందటం అంత సులభమైన సంగతి కాదు.'

'మరదీ! మహాసముద్రసమానమైనది నీమనస్సు. నీలో ఉనంత ఆత్మబలంనాకెక్కడినుంచి వస్తుంది? నీధైర్యంఅపారమైనది. అందుకనే నువ్వు నాహృదయంలోని కల్లోలాన్ని గమనించ లేకపోతున్నావు. నేను జీవితంలో ఇంతకు ముందెప్పుడూ ఇంత బాధ ననుభరించలేదు ఈ బాధనుంచి విముక్తి పొందాలని ప్రయత్నించినకొద్దీ మరింత అగాధంలోకి కూరుకుపోతున్నాను. ఏం చేయాలో ఏమీ తోచటంలేదు.'

'వదినా! అదిసహజమే! ఒక చిన్నసంగతిఆలోచించు
సన్నిధిని ఒకదొంగ దొంగిలిస్తున్నప్పుడు నీకుకోపమూ వస్తుంది
బాధాకలుగుతుంది. అతడు దొంగిలించే వస్తువును అతనికి
దానం చేశానని గనుక నువ్వు ఆలోచించేటట్లయితే నీకేమీ
బాధకలుగదు. దానివల్ల నీకు ఆనందమేకలుగుతుంది దొంగ
మీాద దయచూపించాననే సంతృప్తి నీకు కలుగుతుంది. భారం
తొలిగి నీమనస్సు తేలికపడుతుంది. ఈర్ష్యాదేషాలు, కోప
తాపాలు ఏవీ ఉండవు. సూర్యరశ్మి సోకగానే విడిపోయే
మంచు తెరవలె అన్నీ తొలిగిపోతాయి. దీనిని ఆలోచించు
కోటానికి గురువులూ అవసరంలేదు, అంతగా జ్ఞానమూ అవ
సరం ఉండదు. నా ఆత్మతప్ప ప్రపంచంలో నాది అనేది,
ఏదీ లేదని అనుకున్నప్పుడు నీమనస్సుకు శాంతి లభిస్తుంది.
సంతోషంగా ఉండ గలుగుతావు.'

రమేశుని మాటలు విని నీరజ మనస్సు తేలికపడింది.
ఆమెసంతోషం పట్టలేకపోయింది.

'మరిదీ! చాలా సంతోషకరమైన సంగతి చెప్పావు.
నేటి వరకు నేను ఇతరులకు దానం ఇస్తూవచ్చాను. గనుకనే
సుఖాన్ని పొందగలిగాను. మోహంలో పడిపోయిధర్మగుణాన్ని
విస్మరించాను, గనుకనే నేనివాళ కష్టాలను అనుభవిస్తున్నాను.
నాకు జ్ఞానోదయం కలిగించావు. నా జీవితనిధిని కూడా
దానంచేస్తాను. ఇంక ఆలస్యం చేయవద్దు' అనిఅందినీరజ.

'అంత తొందరపడతావెందుకు వదినా? ప్రశాంతంగా
ఆలోచించుకో!'

'వీల్లేదు; మరదీ! ఇక క్షణం కూడా ఆలస్యం చేయవద్దు. మీ అన్నయ్య వెళ్ళి పాకలో ఉంటున్నప్పటి నుంచి నే నెంత కుమిలిపోతున్నానో నీకు తెలియదు. ఇప్పుడే ఆ పని జరగాలి; నామనస్సు తేలికపడుతుంది. లేకపోయితే రాత్రికి నాకు నిద్రకూడా రాదు. నాహృదయం పగిలి పోతుంది! వెంటనే నారినీ, సరళనూ పిలుచుకురా! వాళ్ళిద్దరి సమక్షంలోనే నా హృదయాన్ని ఆవేశించిన అనుమాన పిశాచాన్ని పార ద్రోలుతాను. నే నేమీ వెరుదీయను, భయపడను! నా కర్తవ్యమేదో హృదయ పూర్వకంగా నెరవేరుస్తాను! చెప్పటమే కాదు, ఆచరించి చూపిస్తాను'.

'వదినా! ఇంకా ఆ సమయంరాలేదు! కొంచెం ఓర్పు వహించు!' అన్నాడు రమేశు.

'ఇంకా సమయం రాలేదనేనా నువ్వనేది? సమయం మించి పోతుందేమోనని నేను భావిస్తున్నాను! మరదీ!' అంది నీరజ.

నీరజ విహ్వలయై, తన కెదురుగా నున్న రామకృష్ణ పరమహంస చిత్రపటాన్ని తదేకంగా చూడసాగింది. చేతులు జోడించి ప్రార్థించింది. తరువాత కొంచెం స్థిమితపడి రమేశుని తో 'మరదీ! మరియొక కోరిక తీర్చాలి' అని అంది.

'ఏమిటి వదినా?' అని ఆశ్చర్య పడుతూ అడిగాడు రమేశ్.

'మరదీ! పదినిమిషాలు నేను దేవాలయంలోకి వెళ్ళి గడపాలనుకుంటున్నాను. అక్కడకు పోతే హృదయానికి బలం చేకూరుతుంది. అందువల్ల నష్టమేమీ లేదుకదా?'

'వదినా! నువ్వుఅక్కడికి వెళ్ళదలచుకుంటే, నాకేమీ అభ్యంతరం లేదు. నే నేమీ అడ్డుచెప్పను.'

'రోషినీ!' అని పిలిచింది, నీరజ దాదిని.

ఏమి కావాలి తల్లీ? అంటూ దాది గదిలోకి ప్రవేశించింది.

'నన్ను కాస్సేపు దేవాలయంలోకి తీసుకు వెళ్ళు' అంది నీరజ లేస్తూ.

డాక్టరు గారు లేచితిరగకూడదని చెప్పారమ్మా...'

'మీడాక్టరు చావురాకుండా కాపాడగలడా!చావును ఆపలేనప్పుడు దేవాలయానికి వెళ్ళకుండా ఎలా ఆపగలుగుతాడు?' అంది నీరజ.

రమేశుడు జోక్యం కల్పించుకొని'దాదీ!వదిననుపూజా మందిరానికి తీసుకువెళ్ళు. ఇందులో నష్టం ఏమీలేదు.' అని చెప్పాడు రోషినీతో.

అప్పుడు దాది నీరజకు చెయ్యి అందించింది. నీరజ లేచి కూర్చుంది. దాది ఆమెను పట్టుకొని, లేపి మెల్లగా పూజామందిరానికి తీసుకువెళ్ళింది. నీరజ అటువెళ్ళిన కొద్ది క్షణములకు, ఆదిత్యుడు ఆమె గదిలోకి వచ్చాడు. నీరజ, గదిలోలేదు. అది గమనించి, రమేశునివైపుచూసి 'నీరజ ఎక్కడికివెళ్ళింది' అని అడిగాడు.

'మరెక్కడికీ వెళ్ళలేదు. పూజామందిరానికి వెళ్ళింది' అని రమేశుడు జవాబు చెప్పాడు.

అంతదూరమా? 'డాక్టరు,ఆమెను మంచంమీదనుండి కదలవద్దని చెప్పాడు' అని అన్నాడు వ్యాకులపడుతూ.

'దేవాలయానికి వెళ్ళటం మందుకంటె ఎక్కువ గుణకారిగా ఉంటుంది. విచారపడకండి! వదినగారు పూజచేసుకొని వెంటనేవస్తారు!' అన్నాడు రమేశుడు.

ఇవాళ ఆదిత్యుడుకూడా చాలా బాధపడుతున్నట్లు ఉన్నాడు. నీరజకు అతడు జాబు వ్రాసి పంపినప్పటినుంచి అతడు మనసులో చాలా అందోళన పడుతున్నాడు. అతనికి ఏమీ తోచటంలేదు. సరళకు తాను దూరంగా ఉండాలనుకున్నాడు. ఆమాటే ఆమెతో చెప్పాలని బయలుదేరాడు. కానీ తీరా అక్కడికి వెళ్ళి తాను అనుకున్న విషయాన్నిగాక అందుకు విరుద్ధంగా ఆమెతో చెప్పివచ్చాడు. అతడు కోనేటిగట్టున కూర్చొని ఆలోచించినప్పుడు ఇందుకు తానూ, సరళ దోషులమనే అతనికి తోచింది.

'నీరజను వివాహమాడాను! ఎన్ని కష్టాలు సంభవించినా ఆమెపట్ల విశ్వాసఘాతకంగా ప్రవర్తించుట న్యాయంకాదు. సరళను చిన్నప్పటినుంచీ ప్రేమిస్తున్నాను. ఈ విషయాన్ని నీరజకు తెలియకుండా, చాలాకాలం దాచాను. ఈ సత్యాన్ని ఎక్కువకాలం దాచకూడదు. దాచటం నాకు యిష్టంలేదు' అని అనుకున్నాడు.

ఈరెండు సత్యాలమధ్య చిక్కుకొని, అతడు దేనిని త్యజించాలో? దేనిని చేపట్టాలో తెలియక, సుడిగుండంలో పడిన మనుష్యునివలె గిరగిర తిరిగిపోతున్నాడు.

'నీరజను వదిలివేసినట్లయితే, అప్పుడు భర్తగా నా కర్తవ్యాన్ని నిర్వహించకపోవటమేగాక విశ్వాసఘాతుకానికి ఒడిగట్టినవాడనవుతాను! అలా చేయటం న్యాయంకాదు!

సరళ నువ్వు త్యజిస్తే నేను ఏకాకినవుతాను! నిస్సహాయుడనై పోతాను. హృదయం వ్యర్థమై పోతుంది. భగ్నహృదయంతో జీవితాన్ని గడపటం ఎలా? యిద్దరిలో ఎవరినో ఒకరిని నావాళ్ళుగా చేసుకోవాలి. అందులోనే నాకు క్షేమం ఉంది! కాని, ఇందులో ఎవరు నావాళ్ళయినా సమస్యాపరిష్కారం కాదా? కాదు. చిక్కు చిక్కుగానే ఉండిపోతుంది!' అనుకున్నాడు ఆదిత్యుడు.

ఆదిత్యుడు, రమేశుణ్ని ఉద్దేశించి 'రమేశ్! నీకు అన్ని విషయాలు తెలుసు ననుకుంటాను?' అని అడిగాడు.

'తెలుసు!' అన్నాడు రమేశ్.

'ఇవాళ యీ విషమపరిస్థితులన్నిటినీ పరిష్కరించ దలచాను.' అన్నాడు ఆదిత్యుడు.

'అన్నయ్యా! అవేం మాటలు? నువ్వు తెలివిగలవాడవు. నువ్వు ఇలా మాట్లాడటం బాగుండదు. నువ్వు ఒక స్త్రీకి భర్తవనే సంగతికూడా మరచి మాట్లాడుతున్నావు. మనం ఈ ప్రపంచంలో, ఈ సమాజంలో ఉంటూ ఉన్నప్పుడు వీటిని దృష్టిలో ఉంచుకునే నడుచుకోవాలి. వదినసంగతి నీకు అవసరం లేదా?'

'రమేశ్! మీ వదినకూ నాకూ మధ్య తలెత్తిన దురభిప్రాయాలను ఇవాళ తొలగించివేయాలనుకుంటున్నాను. నేనూ సరళ చిన్నతనంనుంచీ ఒకేచోట పెరిగి పెద్దవాళ్ళమయ్యాము. మా యిద్దరికీ ఉన్నసంబంధం ఎలాంటిదో నీకు తెలుసుకదా! ఇందులో మా అపరాధం ఏముంది?'

ఇందులో అపరాధం ఏమీ లేదే!'

మా ఇద్దరిమధ్య ఉన్నసంబంధంలో ప్రేమదాగిఉందని నాకు మొట్టమొదట ఏమీ తెలియనే తెలియదు. ఆ ప్రేమ స్వరూపంఇవాళనాకుఅర్థమయిందిఇందులోనాతప్పేమీలేదు'

'తప్పు ఉన్నదని ఎవరంటారు?'

'ఆ సంగతినే ఇవాళ దాచకుండా స్పష్టంగా చెప్పివేయ దలచాను.'

'రహస్యంగా దాచిఉంచమని నీ కెవరుచెప్పారు? కానీ అది అందరితోనూ చెప్పుకుంటూ తిరగటంకూడా మంచిది కాదని నా ఉద్దేశ్యం. ముఖ్యంగా వదినతో ఈ విషయాలన్నీ చెప్పటం శ్రేయస్కరమూకాదు, అది అంత తెలివిగలపనీ కాదు. ఆమెకు ఇప్పుడు తెలిసినదానికంటె ఎక్కువ తెలియ నివ్వటం మంచిదికాదు. ముందు దీనినిగురించి వదిన నీతో ఏమిచెప్పుతుందో విను. ఆ తరువాత నీకు ఉచితమని తోచిన రీతిన మాట్లాడు.

సరిగ్గా అదేసమయానికి నీరజ గదివాకిట్లోకి వచ్చింది. భార్యాభర్తలిరువురూ తమ హృదయాలలో ఉన్నదానిని పరస్పరం మాట్లాడుకోనివ్వాలనే ఉద్దేశ్యంతో నీరజరాకను గమనించగానే రమేశుడు గదిలోనుంచి బయటకు వెళ్ళి పోయాడు.

రమేశుడు బయటకు వెళ్ళిపోగానే నీరజగదిలోకివచ్చి, రాగానే భర్తపాదాలచెంత కూలబడి, అతని పాదాలను కౌగ లించుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

'నేను మీకు అపచారంచేశాను. నావల్ల అపరాధం జరిగింది. అయినప్పటికీ మీరు నన్ను మన్నించాలి. ఇప్పటి

వరకు మీ పాదాలవద్ద ఆశ్రయం ఇచ్చారు. ఇప్పుడు నన్ను దూరంగా నెట్టివేయకండి. మీ పాదాలచెంతనే ఆశ్రయం ఇవ్వండి' అని ఏడుస్తూ నీరజ భర్తను వేడుకొంది.

ఆదిత్యుని హృదయం కరిగిపోయింది. అతడు ఆమెను తన హృదయానికి హత్తుకొని ఓదారుస్తూ 'నీరూ! నీ హృదయంలోని బాధ నాకు తెలుసు'అన్నాడు. తరువాత ఆమెను మంచంమీద పడుకోబెట్టాడు.

నీరజకు దుఃఖం ఆగలేదు. కట్టలు తెగిన ప్రవాహంవలె కన్నీరు కారసాగింది. ఆదిత్యుడు మౌనంగా ఆమె తలను నిమురసాగాడు.

దుఃఖావేశంలో నీరజ భర్తచేతిని తన హృదయం మీద ఉంచుకొని 'మీరు నన్ను మన్నించకపోతే నా మనస్సుకు శాంతిఉండదు. నేను చనిపోయిన తరువాతకూడా నాకు ఆత్మశాంతి ఉండదు' అని అంది.

'నీరూ! అవేం మాటలు. పూర్వం మాత్రం మనమధ్య మనస్పర్థలురాలేదా? మళ్ళీ మనం ఒకటికాలేదా; ఎప్పుడూ నువ్వు నాదానివే!' అన్నాడు ఆదిత్యుడు.

'అనేకసార్లు మనకు మనస్పర్థలు వచ్చిన మాట నిజమే. కాని అప్పుడు మీరు ఇల్లువదలి వెళతానని అనలేదు. కోపంతో మీరు ఇలాంటి నిశ్చయానికి రావటం ఇదే మొదటి సారి. నామీద మీకు పూర్తిగా ప్రేమలేకుండా పోయిందా!'

'పొరపాటే జరిగిందినీరూ! నన్నుమన్నించు' అన్నాడు ఆదిత్యుడు.

ఎంత మాట! నేను మిమ్మల్ని మరించటమా! నా సర్వస్వం మీరే కదా! నేనే అనవసరంగా మిమ్మల్ని అనుమానించాను. అందుకు తగిన శిక్ష అనుభవించాను రమేశ్ ఎక్కడికి వెళ్ళాడు? సరళను తీసుకరమ్మని పంపాను. ఇంకా రాలేదు. ఎందుచేతనో?' అని అంది నీరజ.

సరళ పేరు వినగానే ఆదిత్యుడు త్రుళ్ళిపడ్డాడు. తన మనస్సును పట్టి పీడిస్తున్న భారాన్ని తేలిక పర్చుకోవడానికి ఇప్పుడు మంచి అవకాశం లభించింది. అలాంటప్పుడు మధ్య సరళ ఇక్కడికి ఎందుకు? ఆ విషయాన్ని తప్పించాలనే ఉద్దేశ్యంతో 'నీరూ! ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. ఇప్పుడు సరళ ఎందుకు?' అన్నాడు ఆదిత్యుడు.

'వాళ్ళిద్దరూ బయట గుమ్మం ముందు ఉన్నట్లుంది' అని నీరజ 'మరదీ, బయటనే నిలబడ్డారేం, లోనికిరండి' అంటూ పిలిచింది.

సరళ, రమేశ్ ఇద్దరూ గదిలోనికి వచ్చారు. సరళ తన వద్దకు రాగానే లేచి ఆమెను ప్రేమతో కౌగలించుకోవాలని నీరజ అనుకున్నది. సరళ అక్కగారి పాదాలకు నమస్కరించింది. నీరజ ఆమెను తన ప్రక్కనే కూర్చుండ బెట్టుకొని దిండు క్రిందఉన్న ముత్యాల హారాన్ని బయటకుతీసి సరళ మెడలో వేసింది.

ఆదిత్యుడు రమేశుడు, నీరజచేస్తున్నపనికి ఆశ్చర్యపడి ఆమెవంక చూడసాగారు. హారాన్ని మెడలోవేసి 'చెల్లీ! ఈ హారం నాతోపాటు నాచితిలో కాలిపోవాలనే ఒకప్పుడు అనుకున్నాను. కాని, ఇప్పుడిక ఈహారాన్ని నాబదులు నువ్వు

ధరిస్తే బాగుంటుందనే అభిప్రాయం కలిగిందినాకు. ఈహారాన్ని ఎల్లప్పుడూ నువ్వు ధరిస్తూఉంటే వారికి పూర్వపు రోజులు గుర్తొస్తూంటాయి.' అని అంది నీరజ సరళతో.

సరళ దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది.- 'అక్కా! ఈ హారాన్ని ధరించే యోగ్యత నాకులేదు. నన్ను మరింత సిగ్గు పర్చకు' అని అంది సరళ.

తన జీవితంలో అత్యంత విలువైననిధిని నీరజ దానం చేయాలని నిశ్చయించుకుంది. ఆదానం పుచ్చుకోవడానికి సరళ అర్హురాలు అని భావించింది. ఆహారాన్ని సరళకు ఇచ్చి తన మనస్తాపాన్ని శాంతపర్చుకోవాలనినీరజప్రయత్నించింది. కాని, నీరజ హారాన్ని తన మెడలో వేయగానే సరళ అమిత బాధపడింది. ఈ విధంగా చేయుటంలో నీరజ ఉద్దేశ్యం ఏమిటి? ఆదిత్యునికీ, తనకూ సంబంధం కల్పించి తమపవిత్రతను కళకింతం చేయాలని నీరజ అభిప్రాయం కావచ్చు. సరళ మనస్సు చాలా వికలమై పోయింది.

సరళ పడుతున్న బాధను గ్రహించి ఆదిత్యుడు' సరళా ఆ హారాన్ని నాకివ్వు. దాని గొప్పతనం నాకు తప్ప ఎవ్వరికీ తెలియదు. నాకు అది అమూల్యమైనది. దీనిని నేను మరె ఎవ్వరికీ ఇవ్వను' అని అన్నాడు.

ఆదిత్యుని మాటలువిని నీరజకు చాలా బాధకలిగింది. ఆమె సరళతో 'నాకు హాయిగా ఊపిరిపీల్చుకునే అదృష్టం కూడా లేనట్లుంది. సర్వమూ నీకు అప్పగించి చనిపోవాలని నాకోర్కె- మమ్మల్నివదిలి నువ్వువెళ్ళిపోవాలని అనుకున్నట్లు

విని, నీ కోశాన్ని ఇచ్చి నిన్నిక్కడే ఉంచివేద్దామని నిశ్చ యించుకున్నాను' అని అంది.

'అక్కా; నువ్వు ఆలోచించినది తప్పు నే నీయింటికి ముడిపడిఉండను; ఉండటం మంచిదికాదు' అని జవాబు చెప్పింది సరళ.

'అంటే, నీ అభిప్రాయం ఏమిటో నాకు అర్థంకాలేదు చెల్లీ' అంది నీరజ.

'అక్కా! నేను సూటిగానే చెప్పాను. నేను చెప్పింది యదార్థంకూడా. ఆ భగవంతుడు నాకు లభించకుండా చేసిన వస్తువును మరొకరినుంచి దానంగా స్వీకరంచలేను. ఇలా అంటున్నందుకు నన్ను మన్నించు, నే నిక ఇక్కడినుంచి వెళ్ళిపోతున్నాను. ఇది నా దురదృష్టమనో, నా పూజాఫలిత మనో అనుకోవద్దు';

ఈ మాటలను సరళ దృఢచిత్తంతో, స్పష్టంగా చెప్పింది. తరువాత వెంటనే గదిలోనుంచి వెళ్ళిపోయింది. ఆదిత్యుడు స్థిమితంగా ఉండలేకపోయాడు.

అతడుకూడా సరళ వెనుక బయటకు వెళ్ళిపోయాడు. అప్పుడు నీరజ రమేశునితో 'మరదీ; ఇదేమిటి. ఇలాజరిగింది?' అని అడిగింది.

'వదినా! నువ్వు తొందరపడ్డావు. ఈరాత్రి ఈవిషయా లేవీ మాట్లాడవద్దని చెపితే నువ్వు నామాట విన్నావుకాదు' అన్నాడు రమేశ్.

'మరదీ! నేను హృదయపూర్వకంగా నా సర్వస్వమూ ఆమెకు అర్పించాను. సరళ ఈమాత్రంకూడా గ్రహించలేక

పోయిందా? నామాటలు విని సంతృప్తి చెందుతుందని ఆశించాను.'

'సరళ నీ అభిప్రాయాన్ని అర్థంచేసుకుంది. కానీ, ఇదంతా నువ్వు హృదయపూర్వకంగా చేశావో లేదో అని సందేహించింది.'

'అయ్యో! అదీ నా దురదృష్టమే! నేను ఎంత నిష్కల్మషంగా వ్యవహరించినప్పటికీ ఆమె సందేహించిందా? నేనెంత పాపంచేసుకున్నానో! నేను నిష్కల్మషహృదయంతోనే చెప్పానని ఆమెకు తెలియపర్చలేకపోయాను. నాకిక సహాయపడేవా రెవరున్నారు?'

'విచారించకు వదినా! నేను నీకు సహాయపడతాను. ఆ భారమంతా నాకు వదలి నువ్వు నిశ్చింతంగా ఉండు! నువ్విక నిద్రపో.'

'నాకిక నిద్ర ఎక్కడిది మరదీ? వారు వెళ్ళిపోతే నాకు మృత్యువే శరణ్యం. ఎలా నిద్రపోగలను! ఆ మృత్యువు ఒడిలోనే ఇక నా నిద్ర!' అని అంది నీరజ.

'వదినా! అన్నయ్య ఇల్లువదలిఎక్కడికీవెళ్ళడు. వెళ్ళలేడు. వెళ్ళగలశక్తి ఆయనలోలేదు. నిన్ను వదిలి ఆయన ఎక్కడికీ వెళ్ళలేడు. ఈ నిద్రమాత్రలు వేసుకో. నీకు నిద్ర పట్టగానే నేను వెళ్ళి అన్నయ్యను తీసుకువస్తాను' అన్నాడు రమేశ్.

నీరజ లేచి కూర్చొని 'మరదీ, వారిని వెంటనే తీసుకురా! వాళ్ళిద్దరూ ఎక్కడకు వెళ్ళారోచూడు! నువ్వు వెళ్ళకపోతే నేనే వెళతాను నడవలేక దారిలో చనిపోతానని భయ

పడుతున్నావా? ఎప్పుడైనా చావవలసిందేకదా; ఇవాళ చస్తాను' అని అంది.

'వదినా! నీకు పుణ్యముంటుంది. ఆపని చేయబోకు. నేనే వెళ్ళి తీసుకువస్తాను' అని చెప్పి రమేశుడు వెంటనే అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

# 7

ఆదిత్యుడు తన వెనుకనే బయలుదేరి రావటం సరళ గమనించింది. వెంటనే ఆమె అక్కడ ఆగిపోయి ఆదిత్యునితో ఏదో చెప్పాలనుకుంది. గొంతులోనుంచి మాటలు రావటం లేదు. చివరకు ఎంతో ప్రయత్నంమీద ఇలా అనగలిగింది. 'ఇలా నువ్వు నావెంటరావటం మంచిదికాదు. నాకు ఇటువంటివి నచ్చవు. నువ్వు వెనక్కి తిరిగి వెళితే నేనుసంతోషిస్తాను.'

'నువ్వు నన్ను నీవెంటరానిచ్చినా, రానివ్వకపోయినా నీతో నాకు అలాంటి సంబంధం ఏర్పడింది. ఇందులో నీదీ తప్పులేదు, నాదీ ఏమీతప్పులేదు అనే నానమ్మకం' అన్నాడు ఆదిత్యుడు.

సరళ గంభీరభావం వహించి 'ఆదిత్యా! ఇది చర్చకు సమయంకాదు. రోగ మనస్సుకు శాంతిని చేకూర్చటం నీ ప్రస్తుత కర్తవ్యం నీ ప్రవర్తనవల్ల ఆమె ఆరోగ్యం మరింత పాడవుతుంది' అని చెప్పింది.

'మరి నాప్రశ్నకు ఏమి జవాబు చెప్తావు' అని అడిగాడు ఆదిత్యుడు.

'నామనస్సు చాలా చికాకుగా ఉంది. నన్ను వత్తిడి పెట్టవద్దు. కొంతకాలం నన్ను ఆలోచించుకోనివ్వు' అనిఅంది సరళ.

ఇంతలో రమేశుడు అక్కడికివచ్చి ఆదిత్యునితో 'అన్నయ్యా! వదిన చాలా బాధపడుతుంది. ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. మీరు వెళ్ళి ఆమెకునిద్రమాత్రలు ఇవ్వండి ఆమెతో ఏమీ చర్చించవద్దు' అని చెప్పాడు.

అతనిమాట విని ఆదిత్యుడు వెంటనే వెళ్ళిపోయాడు. సరళ రమేశుని వైపుచూసి' రేపు మీరందరూ శ్రద్ధానంద పార్కులో సభ జరుపబోతున్నారట! నిజమేనా?' అని అడిగింది.

'నిజమే' అన్నాడు రమేశ్.

'రేపటిసభకు నువ్వు వెళ్ళవా?' అని అడిగింది సరళ.

'వెళ్లాలనే అనుకుంటున్నాను, కాని వెళ్ళలేనేమో!'

'ఎందుకని?'

'విని ఏం చేస్తావు?'

'వెళ్ళకపోతే అందరూనిన్ను పిరికి వాడవని అంటారు.'

'అంటే అననీ. అంతేగదా! అంతకంటె మరేమీ కాదుగా'?

నువ్వు రేపుతప్పకుండాసభలోపాల్గోవాలనేనేనుకోరేది!'

'అంటే నీ ఉద్దేశ్యం? స్పష్టంగా చెప్పు.'

'జండా పట్టుకొని నేనూ వెళదామని అనుకుంటు న్నాను' అని అంది సరళ. ఆమెకంఠస్వరంలో దృఢసంకల్పం ధ్వనించింది.

'నీ ఉద్దేశ్యం ఇప్పుడు అర్థమయింది' అన్నాడు రమేశ్.

'నా మార్గానికి ఆటంకం కలిగించవద్దని ముందే చెపుతున్నాను' అంది సరళ అతనితో.

'నీకు ఏవిధమైన ఆటంకమూ కలిగించను' అన్నాడు రమేశ్.

'ఖాయమే గదా!' అని అడిగింది సరళ.

'ఖాయమే!' అన్నాడు రమేశ్.

'మనిద్దరమూ కలిసి వెళదాం' అంది సరళ.

'ఇద్దరమూ కలిసి వెళ్ళవచ్చు. కాని, పోలీసులు మనిద్దరినీ ఒకేచోట ఉండనివ్వరు' అని చెప్పాడు రమేశు.

ఇంతలో ఆదిత్యుడు అటు వచ్చాడు. అతని రాకను గమనించి సరళ 'ఇప్పుడే గదా వెళ్ళారు! వెంటనే వచ్చారేమిటి?' అని అడిగింది.

'నీరజ మాట్లాడుతూ మాట్లాడుతో వెంటనే నిద్రపోయింది' అని జవాబు చెప్పాడు ఆదిత్యుడు.

'నే నిక వెళతాను' అన్నాడు రమేశు.

అందుకు సరళ నవ్వుతూ 'వెళ్లాలని ఉంటే వెళ్ళు, ఎవరు వద్దన్నారు నిన్ను! రేపటికే ఇల్లు మాట్లాడి సిద్ధంగా ఉండు. నీకు మతిమరుపు ఎక్కువ. గుర్తుంచుకో' అని హెచ్చరించింది.

'మరే విషయమైనా మర్చిపోతానేమోగాని ఈ విషయం ఎందుకు మర్చిపోతాను? ఆ ప్రదేశాన్ని నేను ఇంతకుముందు అనేకసార్లు చూశాను కనుక విచారించాల్సినపనేమీ లేదు' అని చెప్పి రమేశు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

# 8

సరళ ఆదిత్యునికి దగ్గరగా నిలబడింది.

'నువ్వు చెప్పదలచుకున్న విషయాలను ఇవాళ వినే ఓపిక నాకు లేదు. రేపు అన్నీ వింటాను, నన్ను మన్నించు' అంది సరళ.

'నామాటలు నీకు భయాన్ని కలిగిస్తున్నాయని నీవు భావించినట్లయితే, నేను ఒక్కమాటకూడా చెప్పను' అన్నాడు ఆదిత్యుడు'

'అయితే నువ్వేమీ చెప్పనంటే, నామాట ఒకటి విను. అదీ నువ్వు వింటానంటేనే చెబుతాను.' అంది సరళ.

'నేను నీమాట దేనిని వినలేదో చెప్పు! నీవు చెప్ప దలచుకున్నదేమిటో చెప్పవచ్చు. తప్పకుండా వింటాను' అన్నాడు ఆదిత్యుడు.

సరళ దృఢచిత్తురాలై ఇలా అంది – 'అక్కయ్య హృదయానికి శాంతి కలిగించుటకు నువ్వు ఆమె చెప్పినట్లు చేస్తూఉండు. ఆమె ఎక్కువకాలం జీవించదని అభిప్రాయ పడుతున్నట్లు నీకు తెలుసు. కనుక బ్రతికిఉన్న నాలుగు రోజు లయినా ఆమెకు శాంతిని కలుగజేసే బాధ్యత నీమీదఉంది. నేను ఆమెకు దూరంగాఉంటాను. నువ్వు ఆమె హృదయానికి సంతోషం కల్గించు. నా విషయంలో ఆమెకు ఒక రకంగా అనుమానం ఏర్పడింది. అనుమానాన్ని దూరం చేయవలసిన బాధ్యత నీమీదఉంది. ఆమె నీ మాటలను నమ్ముతుంది. ఆమెకు శాంతిని కలిగించు. ఆమెకు శాంతి లభించగలదనే ఉద్దేశ్యంతో నేనుదూరంగా వెళ్ళిపోతున్నాను' అన్నదామె

'నేను నిస్సహాయుణ్ని. సరళా! నువ్వు నాలో ప్రతి అణువులోనూ నిండిఉన్నావు!' అని ఆదిత్యుడు జవాబు చెప్పాడు.

'కాదు! కాదు! సామాన్యమానవునివలె నువ్వు పిరికి వాడవు కాదుగదా! అంత నిరుత్సాహంగా మాట్లాడతా వెందుకు? నువ్వు పిరికివాడవుకావద్దు. నీకు నిజంగా నామీద ఏమాత్రం ప్రేమ ఉన్నా ఆ ప్రేమమీద ఒట్టు. అక్క బ్రతికి ఉన్నంతకాలం నువ్వు నన్ను మరచిపోవాలి. అంతేగాక - ఆమెపట్ల సేవానిరతుడవై ఉండాలి. నేను ఆమె సుఖసౌఖ్యా లను అపహరించటానికి ఆమె జీవితంలోకి రాలేదనీ, అలాంటి చెడుతలంపు నాకు లేదనీ ఆమెకు నచ్చచెప్పాలి. నే నలాంటి దురుద్దేశ్యంతో మీమధ్యకువచ్చానని భావిస్తూ ఆమె మర ణించటం నా కేమాత్రం యిష్టంలేదు. ఈ కార్యాన్ని నువ్వుమాత్రమే నిర్వహించగలవు మరెవ్వరివల్ల ఈపనికాదు!' అంది సరళ.

ఆదిత్యుడు మౌనంగా ఉండిపోయాడు.

అతని మౌనాన్నిచూచి సరళ 'ఆ విధంగా చేస్తానని మాట ఇవ్వు' అంది.

అందులకు ఆదిత్యుడు 'సరళా! ఒక షరతుమీద ఆ విధంగా చేస్తానని మాటఇస్తాను' అని అన్నాడు.

'నీషరతును అంగీకరించటానికి నేను సిద్ధమే, కానీ నాకొక సందేహం. నేను కోరినది నువ్వు తేలిగ్గాయివ్వగలవు; మరి నువ్వు పెట్టే షరతును నేను అమలు జరుపుట అంత సుల

భం కాదేమో అని నాసందేహం. దానిని పూర్తిచేయగల సామర్ధ్యం నాకు ఉంటుందో లేదో!' అంది సరళ

'నేను పెట్టేషరతు నువ్వు అమలు జరపలేనంత కష్టమైనదేమీ కాదు" అన్నాడు అదిత్యుడు.

'అలా అయితే అది నెరవేర్చటానికి నేను సిద్ధంగా ఉన్నాను!' అంది సరళ.

'వేటినైతే హృదయంలో ఇంతకాలం దాచుకొని యీ చిక్కులో పడ్డానో వాటిని నీకు ఇవాళ తప్పకుండా చెబుతాను నువ్వు చెప్పదలచినవి కూడా వినటానికి సిద్ధంగా ఉన్నాను. నీవు చెప్పేవిషయం నేను నెరవేర్చ తగినదైతే తప్పకుండా పాటిస్తాను. దానికి ఒకషరతు నువ్వు నామానసిక వ్యధను దూరంచేయాలి; నాకు నూతనజీవిత జ్యోతిని ప్రసాదించాలి.' అన్నాడు ఆదిత్యుడు.

నాచేత వాగ్దానం చేయించాలని ప్రయత్నిస్తున్నావే కాని ఒక్క విషయం మాత్రం మరుస్తున్నావు. ఏమిటంటే వాగ్దానం చేయించటం సులభమేకాని, దానిని పాటించటం చాలా కష్టం' అంది సరళ.

'మనసు ఉంటే మార్గం దొరకదంటావా ! ముందు ఒక విషయం అడుగుతాను చెప్పు! నామీద నీకు మనసు ఉందా లేదా?' అని అడిగాడు ఆదిత్యుడు.

'నువ్వు యీ విధంగా మాట్లాడి నాకు దుఃఖం కలిగిస్తావెందుకు? నా జీవితంలో, నువ్వు తప్ప మరొకదారిలేదనీ నువ్వే నా సర్వమనే విషయాన్ని అర్థం చేసుకోటానికి ఎందుకు ప్రయత్నించవు? యదార్థానికి నీమీద నాకు మనసే

లేకపోతే యీ జీవితం ఎప్పుడో సమాప్తమై పోయేది!' అంది సరళ.

'మంచిది! నేను ఇప్పుడు పూర్తిగా గ్రహించాను ఇక నేను నా పనిమీద వెళ్ళిపోతాను! నువ్వు చెప్పిన ప్రకారం నడచుకుంటాను!' అన్నాడు ఆదిత్యుడు.

'కొంచెంసేపు ఉండలేవా?' అని అడిగింది సరళ.

'లేదు. ఇక యిక్కడ ఉండను! ఉండి నీ భావాలు మారిపోయేటట్లు చేయను! నామూలంగా నీఆలోచనా పరంపరలో మార్పురావటం నాకు ఇష్టం లేదు! నీవు ఏది ఆలోచించుకున్నావో, దానిలో నీకు భగవంతుడు సఫలత కలిగించుగాక!' అన్నాడు ఆదిత్యుడు.

'నా అదృష్టానికి నన్ను వదులుతున్నారంటే, నా ఇష్టప్రకారం నన్ను పోనిస్తున్నారంటే, నిజంగా ఇది మీ భావౌన్నత్యానికి నిదర్శనం! నేను ఏమి ఆలోచించుకున్నదీ, ఏమి చేయబోతున్నదీ యిక మీకు తెలియకుండా ఎక్కువ కాలం దాయలేను. త్వరలోనే మీకు అన్నీ తెలుస్తాయి! అంది సరళ.

'సరే నీభవిష్యత్ గురించి నాకు ఏమీ చెప్పదలచుకోలేదా?' అని ప్రశ్నించాడు ఆదిత్యుడు.

నా భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించే భారం రమేశ్ వహించాడు.' అంది సరళ.

'రమేశుడు నీకు ఆశ్రయం యివ్వగలడా! వాని వద్ద డబ్బు కూడా లేదు. వానికే ఉండటానికి ఆధారం లేదు!' అన్నాడు ఆదిత్యుడు.

'అతడు కల్పించబోయే ఆశ్రయం చాలాఅందమైనది. చక్కని రాతిభవనం! అయితే ఆయిల్లు అతని స్వంతంకాదు. అయినప్పటికీ, అందులో ఉండే అధికారాన్ని సిద్ధింపజేసు కున్నాడు. ఏది ఏమైనప్పటికీ మామార్గానికి యివేమీ అడ్డు రావని గట్టి నమ్మకం ఉంది.' అంది సరళ ప్రసన్నవదన .

'నీదంతా చాలా వింతగా ఉంది. అన్నీ చిత్రంగా మాట్లాడు తున్నావు! వివరంగా చెప్పరాదూ!' అనిఅడిగాడు ఆదిత్యుడు.

నీకు అన్నీ విపులంగా చెప్పాలనే ఉంది. కానీ ఒక్క భయం నన్ను వేదిస్తున్నది. అన్నీ విన్న తరువాత నాదారిని నన్ను పోనివ్వకుండా అనవసరమైన ఆటంకాలూ, అడ్డంకులు కల్పిస్తావేమోనని నాభయం! అలా చేయనని నాకు ముందుగా వాగ్దానంచెయ్యి! అన్నీ చెబుతాను!' అంది సరళ.

'నాకు దూరంగా ఉంటూ, స్థిర చిత్తంతో ఉండగలవా?' అని ప్రశ్నించాడు ఆదిత్యుడు.

'భగవంతునికే తెలియాలి!' అన్న దామె.

'అలా అయితే సరే! ఏదిజరిగినా! భగవంతుడు మన మేలుకే చేస్తాడు. అయితే ఒక్కమాటచెప్పు. విడిచిపోతున్న యీసమయంలో నన్ను యీ విధంగానే వదలి పోతావా?' అని ప్రశ్నించాడు ఆదిత్యుడు

'ఆదిత్యుడా విధంగా అంటున్న సమయంలో, అతని హృదయం దుఃఖ భరితమై పోయింది. అతని హృదయంలో పొంగి పొర్లుతున్న దుఃఖం, నేత్రాలలోనికివచ్చి అశ్రుజలంగా వర్షించసాగింది

సరళ కూడా స్థిరచిత్తంతో ఉండలేక పోయింది. ఆమె హృదయాంతరాళంలో చిరకాలంనుండీ అణగిమణగి ఉన్న ప్రేమ పెల్లుబుకింది. వెల్లువలై పారింది. ఆమె ఆదిత్యునకు మరింత దగ్గరగా వచ్చింది. రావి ఆకులవలె వణకుచున్న ఆదిత్యుని పెదవులపై తన చెక్కిలిని ఆనించింది.

# 9

తెల్లవారింది. నీరజ నిద్రలేచి 'రోషీ్ని!' అని దాదిని కేకవేసింది.

'వస్తున్నానమ్మా!' అంటూ దాదిగదిలోకివచ్చింది.

'సరళ యింట్లో కనబడటం లేదే!' అని అడిగిందినీరజ.

దాది నిట్టూరుస్తూ, 'నీకు తెలియదా అమ్మా? ప్రభుత్వంవారు, ఆమెను అరెస్టుచేసి జైలుకు పంపించారు!' అని జవాబు చెప్పింది.

'ప్రభుత్వంవారు ఆమెను జైలుకు పంపటానికి ఆమె చేసిననేరం ఏమిటి?' అని ప్రశ్నించింది నీరజ.

'అమ్మా! ఏమనిచెప్పను? చాలా ధైర్యముగా తయారయి దొరగారి బంగళాగేటులోని చౌకిదారు కళ్ళల్లో దుమ్ముకొట్టి 'బంగాళాలో జొరబడి దొరసానిగారి గదిలో దూరింది' అని దాదివింతగా నీరజకు విషయాన్ని వర్ణించి చెప్పింది.

'ఎందుకు? ఏంచేదామనివెళ్ళిం దక్కడికి?' అని అడిగింది నీరజ.

'మహారాణిగారి ముద్రను దొంగిలించాలని వెళ్ళిందట. ఆముద్ర ఉన్నపెట్టెను దొంగిలిద్దా మనుకుందట! ఆపిల్లకు ఎంత ధైర్యమో చూడు!' అంది దాది.

'ముద్ర దొంగిలించి ఏం చేస్తుంది?' అనిఅడిగిందినీరజ.

'నువ్వో మంచిదానివే నమ్మా! ఈ మాత్రం తెలియదూ! ముద్రంటే సామాన్యమా! అది తెల్లవాళ్ళరాజ్యానికి తాళంచెవి; మహారాణి ముద్ర చేతిలో ఉంటే తెల్లదొరగారి నైనా కొరతను వేయించవచ్చు. ఈ ముద్ర బలంతోనే తెల్లవాళ్ళ రాజ్యమంతా నడుస్తుందని నీకు తెలియదా?' అని చెప్పింది దాది. నీరజకు అర్థమయేటట్లు చక్కగా వివరించాలని దాది ఉద్దేశం.

'మరి మామరది రమేశు డెక్కడ!' అని మరల ప్రశ్నించింది నీరజ.

'ఆయనను కూడా సరళతో పాటు పట్టుకున్నారు. కన్నం వేయుటానికి ఒక గునపం పట్టుకు వెళ్ళాడట. దానితో సహా పట్టుబడ్డాడట. వాళ్ళిద్దరూ అనేక సంవత్సరాలు జైల్లో ఉండాలి. చాలా కఠిన మైన పనులు చేయిస్తారు. అమ్మా! నాకో మాటచెప్పు. సరళమ్మ గారు నాకిచ్చిన చీరను ఉంచుకోమంటారా? లేక ఎక్కడైనా పారేయ మంటారా!' అని అడిగింది దాది.

'ఏంచీరె? నీవద్దకు ఎలావచ్చింది? ఎప్పుడువచ్చింది?' అని అడిగింది నీరజ.

'సరళమ్మ వెళుతూ కంటతడి పెట్టుకుంది. నన్నుపిలిచి నాకెండజరంగుచీర ఇచ్చి మాకోడలికి యిమ్మన్నది. యదార్థా

నికి ఆమెను ఎంతో రోష్టుపెట్టూ ఉండేదాన్ని, కాని ఆమె మాత్రం పోతూపోతూ నామీద చాలా దయ చూపింది. ఆ చీర ఉంచుకున్నందుకు ప్రభుత్వంవారుపట్టుకెళ్ళరుకాదా?' అని అడిగింది దాది.

'నువ్వు అనవసరంగా భయపడి చస్తావెందుకే? నీకు వచ్చిన భయమేమీలేదు! పోయి, బయటగదిలో వున్న ఇవాళ్టి పత్రిక తీసుకురా?' అంది నీరజ.

రోషినీ వెళ్ళి, పత్రిక తీసుకు వచ్చింది. నీరజ పత్రిక తెరచి చదివింది. 'ఇంత జరిగినా ఆయన నాతో ఏమీ చెప్పలేదే!' అనుకుంది మనస్సులో 'జైలుకు వెళ్ళటం వల్ల' ఆమె ఆయన దృష్టిలో మరింత గొప్పదైపోయి ఉండవచ్చు! ఆమెను మహా వ్యక్తిగా భావించి ఉంటారు. ఇంతకీ జైలుకు పోయిందే కాని, నాకంటె గొప్పపని యేమి చేయగలిగింది? నేను అనారోగ్యంగా లేకపోతే, నేను మాత్రం జైలుకు వెళ్ళలేకపోయే దానినా? ఒక్క జైలేమిటి! వెధవజైలు; కావాలంటే ఉరికంభం ఎక్కేదాన్ని!' అని ఆలోచించ సాగింది నీరజ. ఆమె హృదయం గర్వంతో పొంగిపోయింది. సరళకు వ్యతిరేకంగా అనేక భావపరంపరలు ఆ గర్వితహృదయంలో తెరలు తెరలుగా రాసాగాయి.

'సరళస్థితి చూశావా? కులీనుల యింట్లో పుట్టిన ఆడది గదా! పరాయి మగవాళ్ళ ఎదుట ఎలాంటి దుస్థితి సంభవించిందో చూడు! అయ్యో! రామా! సిగ్గూ ఎగ్గూ యేమాత్రం లేవు దానికి!' అన్నది నీరజ రోషినీతో

'అమ్మ బాబోయ్ ఆమాటతలచుకుంటేనే నావళ్ళు జలదరిస్తోంది. దొంగలను కూడా మించిన పని' అంది దాది.

ప్రతి మాటకు అడ్డదిడ్డంగా జవాబు చెప్పేది. ప్రపంచానికి తాను గొప్ప తెలివి తేటలు గలదాననని చూపాలనుకునేది. తోట పనిలో ఆవిడతో సమానమైన వారు ఎవరూ లేరట! ఇక జైలు వెళ్ళి తన వీరత్వాన్ని ప్రపంచానికిచాట దలచుకుంది. ఎంతగర్వం! ఎంతగర్వం! అంది నీరజ.

సరళ దాదికి చీర ఇచ్చింది గనుక సరళను అంతగా నిందించటం భావ్యమనిభావించలేదు. అందుకనియిలాఅంది. దాది- 'అమ్మా చూడు! నువ్వుచెప్పిందంతానిజమేకావచ్చు, కానీ చాటుమైనా నిజంచెప్పకోవాలి. ఏమంటేఆఅమ్మాయి వట్టి భోళామనిషి! ఎవరికైనా ఏదైనా యివ్వదలిస్తే మనస్ఫూర్తిగా యిస్తుంది!'

దాది మాటలు విని నీరజకు ఎక్కడలేని కోపము వచ్చింది. ఆమాటలు నీరజ హృదయంలో శూలంవలె నాటాయి. ఆమె మనస్సు బాణం నాటిన లేడివలె అయింది.

'రోషీ్మ! నాదే పొరపాటు! నువ్వు అన్నదే నిజం! శరీరం సహాయపడకపోతే, మనస్సు ఎలా సాయపడుతుంది? శరీరారోగ్యాన్ని బట్టే మనస్సుకూడా నడుస్తూ ఉంటుంది. నేను రోగిష్టి దాన్నయి పోయాను. దానితోపాటు మనసు కూడా చెడిపోయింది. సంకుచిత మనస్సుతో మాట్లాడాను. నేను దోషిని!నాదోషానికి శిక్ష నేనే వేసుకుందామనుకుంటూ ఉంటాను! నీవన్నట్లు సరళ సాఫీఅయిన మనిషి సరళస్వభావంగలవ్యక్తి, దానికి అసత్యమంటే ఏమిటో తెలియదు. ఒక్క

పనిచేసిపెట్టు రోషినీ! ఒకసారి గుమస్తా గణేసుణ్ని యిక్కడకు పిలుచుకురా!' అని చెప్పింది నీరజ.

'నీరజ ఆజ్ఞవిని దాది అచటనుండి వెళ్ళిపోయింది. నీరజ కలంకాగితం తీసుకుని, సరళకు ఒక జాబు వ్రాసింది. ఇంతలో గణేసుణ్ని వెంటబెట్టుకొని రోషినీ అక్కడకు వచ్చింది.

జాబును గణేసుని చేతికియిస్తూ, నీరజ 'గణేశ్! యీ జాబును జైలులోఉన్న సరళకు అందజేయగలవా?' అని అడిగింది.

గర్వంతో గణేసుని హృదయం పొంగిపోయింది. కొదమ సింగములాగున గర్జిస్తూ గణేసుడు 'ఎందుకు జేర్చ లేనండీ! కాని ఒక్క విషయం వుంది. జాబు ఆమెకు చేరా లంటే డబ్బు కావాలి. డబ్బుతో కూడినపని' అని అన్నాడు.

'డబ్బుకేం కొదువ? తీసుకువెళ్ళు' అని అంది నీరజ.

'ఇంకొక్క విషయం. ఈ జాబులో ఏమి వ్రాసి ఉన్నదో చెప్పాలి. జైలులో వాళ్ళు జాబులన్నీచించి చదువు తారనే విషయం మీకూ తెలుసుగదా! అందుకని యీ జాబులో వాళ్ళకు నచ్చని విషయాలేమీ ఉండకూడదు. ఆ జాబు నాకు చదివి వినిపించండి!' అన్నాడు గణేసుడు.

నీరజ జాబుచదివి వినిపించింది. అందులో ఇలాఉంది.

'సరళా! నీ గొప్పతనాన్ని ఒప్పుకుంటున్నాను. నువ్వే గొప్పదానివే! నువ్వు.నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాననే వార్త వినగానే సంతోషపడతావు. నీవు జైలునుండి రాగానే నేనూ నీ మార్గాన్ని అనుసరిస్తాను! —నీ నీరజ'

గుమస్తా గణేశుడు భయపీడితునివలె ముఖంపెట్టాడు.

'మార్గానుసరణ అని వ్రాశారే ఆమాట మంచిది కాదు; పోలీసు అధికారి ఆమాట చూడగానే జాబును సరళకు చేరనివ్వడు. సరే, మీరు ఏదో మీమనస్సులో ఉన్నది వ్రాశారు. ఏదేమైనా మన వకీలుగారికి ఈజాబు చూపించి, సరిచేయిస్తాను' అన్నాడు గణేశుడు.

నీరజ ఆజాబును గణేశునకు యిచ్చింది.

జాబు తీసుకొని గణేశుడు వెళ్ళిపోయాడు.

రోషిణీకూడా వెళ్ళిపోయింది.

నీరజ ఆ ఘటనల నన్నింటినీ ఒకొ్కటొకొ్కటిగా తన స్మృతిపథానికి తెచ్చుకోసాగింది. చలనచిత్రంలోవలె అవన్నీ ఒకొ్కటొకొ్కటిగాఆమెనేత్రాలఎదుటనాట్యమాడసాగినాయి.

రమేశుని మాటల మహాత్మ్యాన్ని ఆమె ఇప్పుడు అర్థం చేసుకోసాగింది.

ఒక్క క్షణంలో ఆలోచించి, మనస్సులోనే రమేశునికి నమస్కరించింది

'రమేశుడు ఆమెకు గురువు!' అని ఆలోచించసాగింది నీరజ.

# 10

మందు గ్లాసులో పోసుకుని, ఆదిత్యుడు రజ గది లోకి వచ్చాడు.

'మీరు తెచ్చిందేమిటి?' అని అడిగింది నీరజ.

'గంట కొకసారి ఈమందు యివ్వవలసిందని డాక్టరు గారు చెప్పారు.' అన్నాడు ఆదిత్యుడు.

'మందు త్రాగించుటకు మీరింత శ్రమపడాలా? ఈ పనిని మీరు ఎవరికైనా అప్పగించవచ్చు కదా! ఎవరికీ అప్పగించటం యిష్టం లేకపోతే ఒక నర్సును పెట్టండి!' అంది వ్యంగంగా నీరజ.

'మందు త్రాగించటం అన్న నెపంతోనైనా నీవద్దకు రావటానికి వీలుపడుతుంది. ఇలాంటి సదవకాశాన్ని పోగొట్టుకోవటం నాకేమాత్రం యిష్టంలేదు!' అన్నాడు ఆదిత్యుడు.

'మీ మనస్సు చికాకుగా ఉన్నసంగతి నాకు తెలుసు. మీరు మనస్సును నిగ్రహించుకోటానికి పడుతున్న తంటాలు నాకు తెలుసు. కాని, నాదొక్కమాట. మీరు నాకోసం వినియోగించే కాలాన్ని తోట విషయంలో వినియోగిస్తే నాకు చాలా సంతోషం కలుగుతుంది. నేను రోగంతో తీసుకుంటున్నదాన్ని కూర్చుండే ఓపికైనా లేదు. నాపట్ల శ్రద్ధ చూపిస్తూ తోట విషయం పట్టించుకోకుండా ఉంటే, తోట కాస్తా పాడైపోతుంది!' అంది నీరజ.

'తోట పాడైపోతుందని నాకు దిగులులేదు. ముందు నీ ఆరోగ్యం కుదుటపడితే, తోట దానంతటదే కళకళలాడుతుంది. పూర్వం మాదిరిగా మనం యిద్దరం కష్టపడి, దానిని చక్కగా రూపొందించుదాం!' అన్నాడు ఆదిత్యుడు.

'మీకు పనిమీద మనసులేదని నాకు తెలుసు. సరళ వెళ్ళిపోయింది ఇక మీరు ఒంటరివారైపోయారు. జరగా

ల్సిందేదో జరిగింది. ఇందులో మన దోషమేమీలేదు! ఇక రాబోయే నష్టాన్ని రాకుండా చూసుకోవాలి!' అంది నీరజ.

'నువ్వు తోట స్త్రీ ఆత్మ అన్నావు. ఇక తోటపని చూచుకుంటే నానిత్యకృత్యంగా భావిస్తాను. దైనందిన కార్యక్రమం రూపొందుతూ భగ్నమవుతూ ఉంటుంది. ఇప్పుడు తోటపని చేయలేని నిస్సహాయస్థితిలో పడ్డాను!' అన్నాడు ఆదిత్యుడు.

'మీరు పురుషులైవుండికూడా ఈ కొంచెం దానికే బాధపడుతున్నారా? సరళ ఉండగా తోటపనిలో పూర్తిగా మునిగిపోతూ ఉండేవారు! గడ్డురోజులు మిమ్మల్ని నలువైపుల నుండి చుట్టు ముట్టివేశాయన్న సంగతి నాకు తెలుసు! పనిలో నిమగ్నులవ్వండి! ప్రయత్నించండి!' అని నచ్చజెప్ప నారంభించింది నీరజ.

'ఆదిత్యుడు ప్రసంగాన్ని మార్చాడు.

'వేడి ఎక్కువగాఉంది. పంఖా వెయ్యనా!'

'మీరు యీ విషయాలలో తలదూర్చకండి. ఇలాంటి పనులు మీకు అనవసరం. మీరు ఈ స్వల్ప విషయాలలో కాలం వృధాచేస్తూ వుంటే, నాకు దుఃఖం కలుగుతుంది. మీకు ఎక్కడకూ వెళ్ళటం యిష్టం లేకపోతే తోట యజమానుల క్లబ్బుకు వెళ్ళండి! అక్కడికివెళ్తే మీమనస్సుకుకుదుట పడుతుంది!' అంది నీరజ.

ఈ విషయంమీద అనవసరమైన వాదోపవాదాలలోకి దిగటం ఆదిత్యునకు యిష్టంలేదు. ఏదో ఒకటి ఆమెకు జవాబు చెప్పి ప్రసంగాన్ని మార్చాలని ప్రయత్నిస్తూ 'నీకు విల్లీ పువ్వులంటే ఎంతో యిష్టంకదూ! అవి తెద్దామని వాటి

కోసం చాలా వెతికాను. కాని, విల్లీ పువ్వులు యీసారి చాల తక్కువగా ఉన్నాయి. ఎక్కడ చూచినా కన్పించలేదు. ఈ ఏడు వర్షాలు చాలా తక్కువ పడ్డాయికదూ!' అందువల్ల బాగా పూయలేదు అన్నాడు.

'నిరాశ చెందుతావెందుకు? నేనుజబ్బుపడివున్నమాట వాస్తవమే. ఈమంచంమీద పడుకొని, తోట వ్యవహారాన్ని నడపలేననుకోబోకండి' మీరు వెంటనే హరియా మాలీకి కబురు చేయండి! చేయవలసిన పని అంతా వారికి చెబుతాను. ఎండిపోయిన మొక్కల్ని పీకి బయటపారేయండి! కొత్త అంట్లను తయారు చేయించండి. కొత్తకుదుళ్ళు పెట్టించండి. మెట్లక్రింద గదిలో ఎరువుఉంది. ఆగది తాళం చెవి, హరియావద్దఉంది. అంట్లకు ఆ ఎరువు ఉపయోగించమని హరియాతో చెప్పండి' అంది నీరజ.

'ఇంట్లో ఎరువు ఉందని హరియా నాతో ఎప్పుడూ చెప్పలేదే!' అన్నాడు ఆదిత్యుడు.

'వాడు మీతో ఎందుకు చెప్పలేదో నాకు తెలుసు. వాడంటే మీకు లక్ష్యంలేదు. వాడి విషయం మీరుపట్టించుకోరు. వాసిని నిర్లక్ష్యంగా చూచిఉంటారు!' అన్నది నీరజ. హరియాపై తనకుగల అభిమానాన్ని వెల్లడిస్తూ.

హరియా! వాడా, వాడి విషయంలో నేనేది చెప్పినా నువ్వు నమ్మవు' అన్నాడు ఆదిత్యుడు.

'అనవసరపు మాటలు నాకు నచ్చవు. మీకుఅంత కష్టంగా ఉంటే నాకు తోటపన్లను నాకొదిలిపెట్టండి ఈ మంచంమీద నుండే ఎలా పని చేయిస్తానో చూడండి!

గుర్తులు పెట్టివాడిచేత పనిచేయిస్తా!' అన్నది నీరజసగర్వంగా.

'కాని ఒక్కమాట! ఈవిషయాల్లో నన్నుయిరికించ బోకు!' అన్నాడు ఆదిత్యుడు.

'లేదు! అలా ఎన్నటికీ చేయను! చచ్చిపోయేముందు నాతోట కళకళలాడుతూ ఉంటే చూసి చనిపోదామని ఉంది అందగా సమృద్ధిగా ఉన్న తోటను మీకు అప్పగించి చని పోదామని ఉంది. నేను చనిపోయినా ఆతోట ఎల్లప్పుడూ నన్ను మీకు గుర్తుచేస్తూ ఉండాలని నాకోర్కె. ఇదే నా అంతిమ కోర్కె. నేను ముందే చెపుతున్నా! దారి ప్రక్కన మీరు నాటించిన బాటిల్ గ్రాంను పీకించివేసి, శీతాకాలపు చెలుకు మొక్కలు నాటిస్తాను. పచ్చిక మైదానంలోపాలరాతి వేదిక కట్టించాలని ఉంది. ఆరకంగా తల వూపుతారెందుకు? ప్లాను ఎలా మార్చి వేస్తానో, ఈ తోట నెలా నడుపుతానో మీరే చూస్తారుగా! మీరు గాబరాపడిపోవాల్సిందే! మీరు ఓడిపోయానని ఒప్పుకొని, నన్ను ప్రశంశించక తప్పదు!' అంది నీరజ.

'అక్కడ వేదికకట్టిస్తే బాగుంటుందనుకుంటున్నావా?' అని అడిగాడు ఆదిత్యుడు.

'మీకు ఇప్పుడేమీ అర్థంకాదు. ఇప్పటి నుండికొంత కాలం వరకు తోటమీద అధికారం నాది. దానిని ఎలా కట్టు దిట్టం చేస్తానో చూడండి. నేను యింతా కష్టపడి నవనవో న్మేషితంగా తోటను రూపొందించి మీకు అప్పగిస్తాను. రోగిష్టిది కదా, దీనిలో శక్తిసామర్థ్యాలు ఉడిగి పోయి ఉం టాయిలే అని మీకు భావిస్తున్నారేమో! ఈకార్యభారా

న్నంతటినీ మోసేశక్తి సామర్థ్యాలు నాలో యింకా ఉన్నాయి. నాకోసం ముగ్గురు మాలీలను, ఐదారుగురు కూలీవాళ్ళను మాట్లాడి పెట్టగలరా! మీరు అలాచేస్తే, మీ కళ్ళ ఎదుటే నేను తోటను ఎలా చక్కదిద్దగలనో చూడండి ఇంత పని మీవల్లకాదు. అని మీచేత అనిపిస్తాను! మీరు సర్వదా గుర్తుంచుకోవల్సిందేమిటంటే, ఈతోటనాది, యీ తోటనాదిగానే ఉండి పోతుంది.' అని అంది నీరజ.

'నేను నీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. నీవేది చెప్పినా దానిని హృదయపూర్వకంగా చేయటానికి సిద్ధంగా ఉన్నాను!' అన్నాడు ఆదిత్యుడు.

'మీరు మీ ఆఫీసుపని చూసుకోండి. మీకు అపనే చాలు!' అంది నీరజ.

'ఆఫీసు పనితోపాటు నీకు పరిచర్యచేయటం ఉచితం కాదంటావా?' అని ప్రశ్నించాడు ఆదిత్యుడు.

కాలం మారిపోవటంతో పాటు నేను రోగిష్టి దానిని అయాను గనుక మీహృదయంలో పూర్వంవలె మెదలుతూ ఉండనేమో దగ్గర ఉంటేనే గుర్తువస్తాను కదూ!'అని ఎదురు ప్రశ్నవేసింది నీరజ.

'నీమాటలను బట్టి చూస్తే నేను నిన్ను కలుసుకోవటం నీకు ఇష్టంలేదని తేలుతోంది. సరే. నేనువెళ్ళిపోతున్నాను. నీకు ఉచితమని తోచినప్పుడు నాకు కబురుచెయ్యి,' అన్నాడు ఆదిత్యుడు. అతని చేతిలో ఒక పూలగుత్తి ఉంది. దానినిఅతడు ఆమె పరుపుమీాద ఉంచి, గదినుండి బయటకు వెళ్ళబోయాడు

సహజ ప్రేమతో నీరజ అతనిచేతిని పట్టుకుంది. 'అంత తొందరేమిటి! కొంచెంసేపు ఉండండి' అంది.

ఆమె మనోనిబ్బరం, సడలి పోతుందన్న విషయం ఆదిత్యునకు తెలుసు ఆదిత్యుడు ఆగిపోయాడు.

'ఎదురుగా ఉన్న పూలకూజాలోని పూలు ఏమిటో చెప్పండి చూద్దాం' అని అడిగింది నీరజ.

నీరజకు మతిచాంచల్యం ఏర్పడుతున్నదని ఆదిత్యుడు గ్రహించాడు. అందువలన, ఆమె ప్రశ్నకు అతడు జవాబు యివ్వలేదు. కేవలం తలవూపాడు. ఆపూలపేరు తనకు తెలియదన్నాడు.

నీరజ గట్టిగా ఊపిరిపీల్చుతూ యిలాఅన్నది.

'అయితే నేనే చెబుతాను వినండి. ఆపూలపేరు పేట్ యూనియా, నేను తెలివితక్కువ దానినని మీ ఉద్దేశం. నా తెలివితేటల్ని తెలుసుకోటానికి మీరెప్పుడూ ప్రయత్నించలేదు' అని అంది నీరజ.

ఆదిత్యుని పెదవులపై చిరునవ్వు చిందింది. అతడు మెల్లగా ఇలా అన్నాడు-

నువ్వు నా అర్థాంగి వన్న విషయం మరచిపోతావేం! నీవు తెలివి తక్కువ దానివేఅయితేఇంచుమించునాతోసమానమైన దానివన్నమాట! ఇందులో చెరుపేమీ లేదుగా! మనిద్దరి జీవితాల్లో సమంగా మూర్ఖత్వం నిండి ఉంది.'

'గతాన్ని గురించిన ఆలోచనలు యిప్పుడు దుఃఖాన్ని కలుగజేస్తాయి. ఇక ఆమధుర దినాలు ఎక్కడ! జీవితంలోని ఆమధురదినాలు నామమాత్రా వసిష్టమై పోయాయి. వాటి

స్మృతి చిహ్నాలు మాత్రమే మిగిలి ఉన్నాయి. భవిష్యత్తును గురించి ఆలోచించరేమి? ఈఇంటి జీవన గమనం యథాప్రకారంగా నడిచేరోజు ఎంతో దూరానలేదు. అయితే అప్పుడు నేను ఉండను. కాల చక్రంతో పాటు, సంసార చక్రంకూడా యథా ప్రకారంగా నడుస్తూ ఉంటుంది. అనాడు కాని, నేను, నిస్సారమైన ఈ ప్రపంచం నుండి సెలవు తీసుకుంటాను. నా అస్తిత్వం ఈ ప్రపంచంలో గాని ఈ సంసారంలోగానీ ఏ మాత్రం ఉండదు. కన్పించదు చనిపోయిన తర్వాతఎవరైనా కనపడతారా, మీరే చెప్పండి!' అన్నది నీరజ.

ఇదొక కఠోరసత్యం మాట్లాడేశక్తి ఈ శరీరమునుండి వేరైపోతే, యిక మిగిలేదేముంటుంది! ఏశాస్త్రాన్ని తిరిగేసి చూసినా దీనికి జవాబే లేదు.' అన్నాడు ఆదిత్యుడు.

'ఎంత భయంకరమైన మీమాంస యేమంటే, యీనాడు శరీరం ఉన్నది! జ్ఞానేంద్రియాలు ఉన్నాయి. కాని మాట్లాడేశక్తి లేకపోతే ఏమీ ఉండదా? అలా ఎందుకవుతుంది! దీనికి కారణ మేమిటి? మీకు ఈవిషయంలో ఏమీ తెలియదా?' అని ప్రశ్నించింది నీరజ

'నాకు మరేమీ తెలియను. కాని. నాకుఒకటిమాత్రం తెలుసు నువ్వున్నావు; ఉన్నంతకాలం నాదానివి వెళ్ళిపోతావనుకో. అప్పుడుకూడా నాదానివే నీస్మృతి చిహ్నమే, నాజీవిత కిరణంగా ఉంటుంది!' అన్నాడు ఆదిత్యుడు ఆమెను ఓదారుస్తూ.

'మంచిదే, ఈపూదోట నన్ను మీకు సర్వదాగుర్తు చేస్తూ ఉంటుంది. ఝుమ్ అంటూ ఉండే వృక్షాలును, కిల

కిల్లాడే పక్షుల కలకలరావాన్ని నా కంఠస్వరంగా భావిస్తూ ఉండండి. మీరు సర్వదా నా ఆత్మను, యీ ఉపవనంలోని ప్రతిపుష్పంలోనూ చూడగలుగుతారు. నేను గాలినై మీ జుట్టును కదలిస్తూ ఉంటాను. మీ ప్రతి అవయవాన్నీ స్పృశిస్తూ ఉంటాను. కోయిలనై మీకు నా మధురగానం వినిపిస్తూ ఉంటాను మీరు నన్ను ఈవిధంగా యీ రూపంలో జ్ఞాపకముంచుకోగలరా? చెప్పండి.' అంది నీరజ.

ఆదిత్యుని మనస్సు చాలా చిక్కనపడింది. అతడు రజ వేసినప్రశ్నకు హృదయపూర్వకంగా జవాబు యివ్వలేకపోయాడు. కాని, 'ఎందుకు జ్ఞాపకముంచుకోనూ?' అని అన్నాడు.

అతడు ఏవిధంగా జవాబు చెబుతున్నాడు అనే విషయాన్ని ఆమె పట్టించుకోలేదు ఆమె అంతకు ముందువలె అలాగే మాట్లాడసాగింది.

'ఆత్మకూ ఆత్మకూ ఎలాంటి సంబంధం ఉంటుందో యీ ప్రపంచంలోని వాళ్ళకేమి తెలుసు. వారికి యీ విషయంలో రవ్వంతయినా తెలియదు. నేను మిమ్మల్ని విడిచి ఉండజాలనని నాకు తెలుసు నేను యీఅస్థిపంజరకారాగారం నుండి విముక్తి పొందవచ్చు. కానీ నేను సర్వకాల సర్వావస్థల్లోనూ మీసముఖంలోనే ఉంటాను. నేను సర్వదా యింతకు పూర్వంవలెనే యీ తోటలో నివసిస్తాను. మీతోటనుసంబాళిస్తూ ఉంటాను ఎప్పటివలె యింతకు పూర్వంకన్న ఎక్కువగా చెట్లూ చేమలను కనిపెట్టుకొని ఉంటాను మీరు నాకుపనిచేసి పెట్టవలసిన అవసరం ఉండదు.'

ఆదిత్యుడు మౌనంగా ఉండిపోయాడు. అతడు నీరజ మాటలను వింటున్నాడు. వాటి అర్థాన్ని గ్రహించటానికి ప్రయత్నిస్తున్నాడు.

నీరజ ఉత్తేజితురాలై దిండును ఆనుకొని మంచం మీద కూర్చుంది. మరల చెప్ప నారంభించింది- 'నేను మిమ్మల్ని ప్రేమించాను. ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తాను, ఇదంతా మీతో చెబుతున్నాను. ఎంతగా ప్రేమించానో, ఎంతగా ప్రేమిస్తున్నానో నాకే తెలియదు. మీరునామాటలనుతప్పుగా భావించవద్దు. నే నింతవరకు చెప్పినదంతా ప్రేమావేశంతో చెప్పాను. ఇంతవరకు మీరునాకు మీ ప్రేమను ప్రసాదించారు. నేను చనిపోయినతరువాత ఆ ప్రేమను ఇతరులకు యివ్వకండి! మీరునాకు యిచ్చిన ప్రేమను యితరులకు యిచ్చినట్లయితే నేను అపఖ్యాతి పాలవుతాను. నాకు శాంతిలభించదు. నా ఆత్మబాధతో తిరుగుతుంది. ఆ బాధ్యతఅప్పుడు కేవలంమీదే!'

నీరజ మాట్లాడుతూ విహ్వలయైనది. కంఠం గద్గదికమై పోయినది. సజల నేత్రయైనది.

ప్రేమ పూరితమై ఆదిత్యుని హృదయంకరిగిపోయింది. విలపించుచున్ననీరజను ఓదార్చలేక పోయాడు. ఆమెప్రక్కనే కూర్చొని ప్రేమ పూర్వకముగ ఆమెను కౌగలించుకున్నాడు; ఆప్యాయముగా ఆమెతలనునిమురుతూ 'నీరూ! దుఃఖించి ఏం ప్రయోజనం! నేను నీవాడనే; నీవాణ్ణిగానే ఉంటాను. అనవసరంగా వ్యాకులపడుతావెందుకు?' అన్నాడు.

'నాజీవితమే వ్యథాపూరితం; నాకు యిప్పుడింకేమీ అవసరం లేదు. మీకు నామీద కోపం ఉన్నదని నాకు తెలుసు. ఎందుకు కాగూడదు? పొరపాటు నాదేగా. మీరు నామీద కోపాన్ని మరచి పొండని ప్రార్థిస్తున్నాను. నన్ను క్షమించి ప్రసన్న వదనులై ఉండవలసిందిగా వేడుకుంటున్నాను. సరళవిషయంలో నేను న్యాయంగా వ్యవహరించ లేదని నాకు తెలుసు. నేను ఆమెకు చేసిన అన్యాయం నాకు హృదయంలో శూలం వలె గుచ్చుకుంటూ వుంది. కాని జరగవలసింది జరిగిపోయింది. ఇప్పుడు నన్ను క్షమించరా? మీరు నన్ను ఈఒక్కసారి క్షమిస్తే, మీరేమి ఆజ్ఞాపిస్తే అది చేస్తాను. అలా చేయుటకు సిద్ధంగా ఉన్ననాకు కావలసింది ప్రేమగాని మరేమీవద్దు. కేవలం మీ ప్రేమ మాత్రమే కావాలి. ఇదే నాఅభిలాష!' అంది రజ.

'నీరూ! అనారోగ్యం వల్ల నీమనస్సు కూడా పాడై పోయింది. నాకు తెలుసు. నీవు ఏమి చేశావో, అదంతా తెలిసి చేయలేదని నాకు తెలుసు. ఇదే నాబాధ; నీగాబరా!' అన్నాడు ఆదిత్యుడు.

నీరజ సంబాళించుకొని 'నేను గతరాత్రే ఒకదృఢసం కల్పానికి వచ్చాను. అదేమిటంటే సరళ యీసారి నాకు అగు పించగానే నాచెల్లెల్ని కౌగలించుకున్నట్లుగా పవిత్ర హృద యంతో ఆమెను నా హృదయానికి హత్తుకుంటాను. కలు షాన్ని క్షాళనం చేసివేసుకుంటాను. నేను నాప్రతిజ్ఞను సఫలం చేసుకొనుటకు నాకు తోడ్పడండి. అంటే నేను మిమ్ముల్నను,

సరళను, యీ యింటిలోని వారందరి ప్రేమను పొందటానికి సహాయ పడండి.'

ఆదిత్యుడు నీరజ యొక్క హృదయావేదనను అర్థం చేసుకున్నాడు. ఆమెను శాంతపరచుటకై ఆమె ముఖమును శిరమును చుంబించసాగాడు. ప్రతిప్రేమను పొంది నీరజ కళ్ళు మూసుకున్నది. ఆమెకు శాంతి లభించింది.

కొంచెము సేపైన తరువాత ఆమె మరల కన్నులు తెరచి తనభర్తను ఇలా ప్రశ్నించింది! 'సరళ ఎన్నిరోజులకు జైలునుండి వస్తుందండీ! ఆమె జైలునుండి రాక పూర్వమే నేను చనిపోతానేమో అన్నభయం నన్ను పీడిస్తుంది. చెల్లీ, నీవంటేనాకేమాత్రంఈర్ష్యలేదు. అని ఆమెతో నేనుస్వయంగా చెప్పాలనిఉంది. కాస్తలైటువేయండి, పుస్తకం చదివి వినిపించండి. మనసుకు సంతోషం కలుగుతుంది!' అంది నీరజ.

నీరజ, తనదిండు క్రిందవున్న 'పీపా' అనేపుస్తకాన్ని తీసి, ఆదిత్యునకు యిచ్చింది. ఆదిత్యుడు ఆపుస్తకాన్ని చదవ సాగాడు ఇంతలోనే దాది ఆగది లోనికి వచ్చి 'యీ జాబు వచ్చిందండి' అని చెప్పింది. కథను వింటూ నీరజ దానిలో మునిగిపోయింది. కాని 'జాబు' పేరువినగానే ఉలిక్కిపడింది. ఆమె ఊపిరిని వేగంగా పీల్చసాగింది. ఖైదీలు అసంఖ్యాకంగా ఉండుటచే వారిలో కొంతమందిని ప్రభుత్వం విడచిపెట్టదల చిందనీ, అలావిడచిపెట్టబడేవారి జాబితాలో సరళపేరుకూడా ఉన్నదని, ఆదిత్యునకు ఒకమిత్రుడు లేఖవ్రాశాడు. అవార్తను

వినగానే ఆదిత్యుని సంతోషానికి మేర లేకపోయింది. అతడు తన ఆనందాన్ని ఎంత అణచుకుందామని ప్రయత్నించినా లాభం లేకపోయింది.

ఔత్సుకంగా నీరజ, 'ఎవరి వద్దనుండి వచ్చిందండీ?' అని ప్రశ్నించింది.

తన హృదయంలోని సంతోషం తన నోటిద్వారా ఎక్కడ బయటపడిపోతుందో అన్న భయంతో ఆదిత్యుడు, ఆజాబును నీరజకు యిచ్చాడు. ఆమె ఆజాబును చదివింది. ఒక్కసారి తన భర్త ముఖాన్ని చూచింది; ఒక్కక్షణం ఆలోచించి తన మనసులో ఏదో నిశ్చయించుకొని ఆదిత్యునితో ఇలా అంది– 'సరే! చాలా మంచిపనే జరిగింది! సరళకూడా విడుదలై వస్తుంది? ఇప్పుడు దుఃఖించ వలసిన అవసరమే లేదు. మీరు స్వయంగా వెళ్ళి సరళను వెంటబెట్టుకొని రండి! అని చెపుతూ ఉండగానే, ఆమె కళ్ళుమూత పడినాయి. దంతాలు కరుచుకుపోయాయి. వెంటనే మూర్ఛిల్లింది. 'త్వరగాడాక్టరును పిలుచుకురండి' అని గదిలోనుండే అరిచాడుఆదిత్యుడు.

దాది డాక్టరును, నర్సును పిలుచుకువచ్చింది. డాక్టరు నీరజయొక్క నాడిని పరీక్షించాలని అనుకున్నాడు. కాని, ఇంతలోనీరజ కళ్ళు తెరచింది.

'డాక్టరుగారూ! నన్ను ఏవిధంగానైన కొద్ది క్షణాలు బ్రతికించండి! సరళను తప్పకుండా కలుసుకోవాలని ఉంది. ఆమెను కలుసుకోనిదే నామనస్సునకు శాంతిలేదు' అందినీరజ.

ఆ ఆవేశంలో నీరజ కళ్ళలో ఒకవింతకాంతితళుక్కు మంది. కాని వెంటనే ఆమె నీరసించి పోసాగింది. కళ్ళు మూతలుపడసాగాయి.

'మరిదీ! లోభివలె చనిపోను! నావాగ్దానం నిలబెట్టు కుంటాను! తప్పక నిలబెట్టుకుంటాను! మరిదీ నీసలహా తప్పక పాటిస్తాను!' అంటూ నీరజ మళ్ళీ మూర్ఛిల్లినది!.

తరువాత ఆమె స్థితి మరింత అధ్వాన్నంగా దిగజారి పోసాగింది.ఆమెకుస్పృహరావడం స్పృహతప్పటం స్పృహవచ్చి నప్పుడు ఏదో తనలో తాను గొణుగుతూ ఉండటం, మరల తెలివి తప్పటం ఈవిధంగా జరగసాగింది.

నీరజ మాటిమాటికి 'సరళవచ్చిందా? అని ప్రశ్నించ సాగింది.

అనేకసార్లు కేకేసింది. ఆమూర్ఛావస్థలోనే 'రోషినీ'నిల.

రోషినీ ఏడుస్తూ 'ఏమిటమ్మా' అని అడిగింది; దాది జవాబును విన్పించుకో కుండా నే నీరజ, కళ్ళు మూసుకొని, అయ్యో!మరిదినిపిలువండి!' అని తనలోతాను గొణుక్కు నేది.

ఇంకొకసారి, 'పిలిస్తే మాత్రం ఏమి లాభం? వద్దు! ఊరుకోండి, నేను మాత్రం అతడు చెప్పినట్లే సర్వస్వమూ దానంచేసివేస్తాను!' అనేది.

పశ్చిమాకాశ కంగస్థలం మీద మెల్లమెల్లగా చీకటి తెరపడసాగింది. నీరజకు స్పృహరాలేదు. ఆమెస్థితి అత్యంత శోచనీయంగా ఉంది.

గదిలో చీకటి వెలుగులు దోబూచు లాడుతున్నాయి. పూదోటవైపు కిటికీ తెరచిఉంది. దానిగుండా పూదోటలోని పూలవాసనలు మెల్ల మెల్లగాగదిలోప్రవేశిస్తూగదిని సువాసన లతోనింపి వేస్తున్నాయి.

అదే సమయంలో సరళను వెంటబెట్టుకొని, ఆదిత్యుడు గదిలోకి వచ్చాడు. గదిలో ప్రవేశించే ముందు, లోపలికి తొంగి చూచాడు. గదిలో ప్రశాంతంగా ఉండటం గమనించి సరళను ద్వారం వద్దనే ఉంచి, తాను లోనికి వచ్చాడు. మెల్లగా నీరజను సమీపించాడు. అడుగులచప్పుడు వల్ల ఆమెకు నిద్రభంగం కాకూడదని అతని అభిప్రాయం.

నీరజ పెదవులు కంపించ సాగాయి. ఆమె కళ్ళు మూసుకునే ఉన్నాయి. ఆమెను ఆస్థితిలో చూస్తే ఏదో మంత్రాన్ని పునశ్చరణ గావించు కొంటుందా అన్నట్టు ఉంది. స్పృహలేనందువల్ల ఆమె జ్ఞానేంద్రియాలు చైతన్య హీనంగా వున్నాయి. కాని, ఆమె నేత్రాలు మాత్రం పూర్వం వలెనే మూసుకొని వున్నాయి.

ఆదిత్యుడు ఆమెస్థితిని చూచి ఆలోచనా సముద్రం లో మునిగి పోయాడు. కాని, కొంతసేపటికి తెప్పరిల్లాడు. ఆమె చెవిలో నీరూ! సరళను తీసు కొని వచ్చాను?' అన్నాడు.

నీరజ మూర్ఛావస్థనుండి తేరుకుంది. ఆమెకళ్ళు తెరచింది. ఈ మాటవినుటకే ఆమెమూర్ఛఉన్నదా!అనిపించింది.

ఆమె కళ్ళు తెరచి భర్తవైపు చూసింది.

'మీరు వెళ్ళండి.' అంది భర్తతో.

ఆదిత్యుడు కొంచెం ప్రక్కకుతప్పుకొని సరళను లోనికి రావలసిందిగా సైగచేశాడు.

సరళ లోనికివచ్చి నీరజ మంచం దగ్గరకు వెళ్ళి నిలబడింది. తరువాత అక్కగారి పాదాలకు నమస్కరించింది.

ఆమె పాదాల వద్ద నిలబడింది. సరళ చేతులు ఆమె పాదాలను తాకగానే, నీరజ విద్యుల్లత తగిలినట్లు గజ గజ వణికిపోసాగింది. తనపాదాలను చివాలున వెనక్కు లాక్కుంది.

నీరజ కంఠస్వరానికి ఎక్కడలేని బలమువచ్చింది. కాని నోటినుండి వెలువడేమాటలు అస్పష్టంగా ఉన్నాయి.

'నేనివ్వను! నే నివ్వను! ఇవ్వలేను!' అంటూ నీరజ అకస్మాత్తుగా ఉద్రేకపడింది. మంచంమీద చివాలునలేచి కూర్చుంది. లేచికూర్చున్న నీరజ అకస్మాత్తుగా లేచినిలబడింది! ఎక్కడనుంచి వచ్చింది ఇంతబలం?

ఆమె చివాలున సరళ చేతిని పట్టుకొని 'పిశాచినీ! నీ కిక్కడ చోటులేదు! ఇక్కడ నేనేఉంటాను! ఇక్కడనుండి వెంటనేపో! నేనుమాత్రమేఇక్కడఉంటాను!' అనిబిగ్గరగాఅరచింది.

ఆమె కంఠస్వరం చాలా భయంకరంగా ధ్వనించింది. ఆమె ఆకారంకూడా మహావికృతంగా మారింది.

అంతలోనే ఆమెనేలకు కూలిపోయింది. ఆమెను ఓదార్చుటకని ఆదిత్యుడు గబగబవచ్చి ఆమెను చేతుల్లోకి తీసుకున్నాడు. అయితే అప్పటికే నీరజ ప్రాణాలు అనంతాకాశంలో లీనమై పోయాయి.



—: సమాప్తం :—

138

భాషాప్రవీణ, అష్టావధాని

శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి

రచనలు

వారశ్రీ

శిల్పసుందరి

హీరదేవి

అరవింద

పులకేశి

కన్నీటికథ



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B193 |
| పుస్తకం పేరు | నీరజ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసేవది | Triveni. |
| పేజీలు విడదీసేవది | Triveni |
| స్కాన్ చేసేవది | Mounika |
| పరీక్ష చేసేవది | RUKSANA |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |